





# విజ్ఞానము

ఆధునిక,భౌతిక,జీవ,గృహ,వృక్ష

## విద్యార్థుల నిర్మాణ కార్యక్రమం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
| --- | --- | --- | --- |
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విద్యార్థుల నిర్మాణ కార్యక్రమం

శ్రీమన్నారాయణ అగర్వాలా

అనువాదం

మైనేని రామకోటయ్య

పురాణం కుమార రాఘవశాస్త్రి

దేశి కవితామండలి

బెజవాడ :: ఘంటశాల

# ప్రవేశిక

భారత స్వాతంత్ర్య సాధనాపథంలో నిర్మాణ కార్యక్రమమునకున్న ప్రాముఖ్యతను గూర్చి అధికంగా నొక్కి వక్కాణించ నవసరం లేదు. గాంధిజీ చెప్పినట్లు "పూర్ణ స్వరాజ్యమును సంపాదించుటకు నిర్మాణకార్య క్రమము సత్యాహింస పూరితమైన మార్గము" జాతిని అధోస్థితినుండి ఊర్ధ్వముఖమునకు తీసికొని పోవుటకై అది ఉద్దేశించబడినది. "రక్తపాతములేని విప్లవము" యొక్క నవ్యాతినవ్యమగు ఎత్తుగడ అది. సాంఘికార్థిక రాజకీయ పునర్నిర్మాణ కళకు గాంధిజీ పెట్టిన విశిష్టమగు భిక్ష అది. దేశములో ప్రజాహిత జీవితంలో గాంధిజీ చురుకుగా అడుగుపెట్టినప్పటినుండి నిర్మాణ కార్యక్రమమే గాంధిజీయొక్క వాస్తవమగు "రాజకీయములు" శాసనసభల కార్యక్రమము జాతికి "విరామసంధి"గా ఉపయోగపడుతోంది.

అర్థిక రాజకీయ నైరాశ్యంతో దేశం కలగుండు పడుతున్న సమయంలో, విశ్వాసంతోను అజేయమగు సంకల్ప శక్తితోను నిర్మాణకార్యక్రమమును ఆచరణ యందుంచుటయే నిజమైన శక్తి, స్వాతంత్ర్యము అని గాంధిజీ మరియొకసారి జాతికి జ్ఞాపకం చేయుచున్నాడు. రాజకీయ ప్రతిష్టంభన పరిష్కారంగాకుండ నిలిచిపోయి నంత మాత్రమున ఆయన నైరాశ్య నిస్పృహలకు హేతువుకానలేదు. స్వరాజ్యమునకు పునాదియైన నిర్మాణ

కార్యక్రమమునందే దేశవిమోచనమున్నదని ఆయన తలుస్తారు.

జాతికి యువజనులు స్తంభములవంటివారు. వారి ధైర్యము భావనా శక్తులమీదనే దేశభవిష్యత్తు ఆధారపడియున్నది. జాతీయ పునర్నిర్మాణోద్యమంలో విద్యార్థుల పాత్ర అతి ముఖ్యమైనది. విద్యార్థులకు కావలసినంతశక్తి, ఉత్సాహము సేవా సంకల్పములున్నవి. కాని అనుభవశాలురు పరిణత మనస్కులునగు జాతీయ నాయకులనుండి సరియైన ఆదేశం వారికి కావలసియున్నది దేశములోని అన్నిమూలలనుండి విద్యార్థులు పాఠశాల జీవితంలో తాము చేయవలసిన వివిధములగు నిర్మాణ కార్యక్రమములనుగూర్చి సలహా యివ్వవలసినదిగా గాంధిజీని కోరుతున్నారు. అప్పుడప్పుడు పత్రికలలో గాంధిజీ యొక్క ఆదేశములు ప్రచురింపబడుచున్నవి. అందువల్ల పదునాల్గు అంశములతో కూడిన నిర్మాణ కార్యక్రమ మొకదానిని తయారుచేయ సాహసించాను. ఆమోదానికై దానిని గాంధిజీకి చూపించాను. కొలది మార్పులు చేసి ఆయన దానిని ఆమోదించారు. చతుర్దశాంశ పూరితమగు నీనిర్మాణ ప్రణాళికను అప్పుడు పత్రికలలో ప్రచురించాను. దేశంలోని యువజనులు తమ శక్తిని నిర్మాణయుతంగా ఫలప్రదంగా వినియోగిస్తారనే వుద్దేశ్యంతో నేనీపని చేశాను. అదృష్టవశాత్తు, ఈకార్యక్రమము విద్యార్థిలోకము యొక్క దృష్టిని బహుళంగాఆకర్షించింది. అందువల్ల నేనుత్సాహపూరితుడనై ఆపదునాల్గు అంశములను విశదీకరిస్తూ

ఆచరణకై వివరములతో కూడిన సూచనలు చేస్తు న్నాను. ఆవ్రియత్న ఫలితమే యీ చిన్ని పొత్తము. చదువులకు భంగం లేకుండా తమ విశ్రాంతి సమయంలో విద్యార్థులు ఈ కార్య క్రమాన్నంతా అమలులో పెట్ట వచ్చు.

పౌరులుగా వారు వికసించినప్పుడు ఈ శిక్షణ వారికెంతో ఉపయోగపడుతుంది.

తమ మాతృదేశానికి సేవ చేదామనే వాంఛ గల నా చిన్ని స్నేహితులకు యీ పుస్తకం కొంత ఉపకరిస్తుందని నేను భావిస్తున్నాను.

—శ్రీమన్నారాయణ అగర్వాలా

---

# 1 స్వాతంత్ర్య వాంఛ

స్వరాజ్యం యొక్క ఆవశ్యకతను గాఢంగా గుర్తించని వారు ఈ అభాగ్య దేశంలో యింకను అనేకమంది కలరు. భారత స్వాతంత్ర్యమందు వారు వాచా ప్రశంసించుటతోనే తృప్తి గాంచెదరు. విదేశ దాస్యము నుండి విముక్తికై వారు వేదన చెందరు. ఇది సరిపోదు, స్వాతంత్ర్యావశ్యకతను మనము ప్రగాఢంగా గుర్తించక పోతే మనము స్వరాజ్యార్హులము కాము. ఈ దేశములోని 40 కోట్ల జనులు స్వీయ మాతృదేశ పరిత్రాణావశ్యకత

ను వాస్తవముగా గుర్తించిన రోజున భూతలముమీద ఏశక్తియు వారి మార్గమునకు అడ్డురా సాహసించదు.

రసవంతమై భావస్ఫోరకమైన ఒకానొక కథ నాకు జ్ఞాపకమొస్తున్నది. ఒకకుర్రవాడు ఒక ఋషి వద్దకు వెళ్ళి ఆయనను ఇల్లా అడిగినాడు "అయ్యా, నేను ముక్తిని ఎలా చేరుకుందును?"

ఆఋషి కొంతసేపు నిదానించి ఆకుర్రవానిని పరిసర ప్రాంతంలో వున్న నదికి తనతోపాటు రమ్మన్నాడు. ఆప్రవాహములో స్నానము చేయమని అడిగాడు. అతడావిధంగా చేయగా స్వామి ఆకుర్రవాని తలను నీటిలో నుంచి పైకి రాకుండా అదిమిపెట్టెవాడు కొన్నిక్షణములైన తరువాత ఆకుర్రవాడు బాధపడి తలకాయను పైకి నెత్తుటకు తన శక్తినంతా ఉపయోగించాడు ఆఋషి తన ఒత్తిడిని కొంచెము తగ్గించినాడు ఆకుర్రవాడు విభ్రాంతుడై ఆయన ఎదుట నిలుచుండగా స్వామి చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు "ప్రేమాస్పదుడా స్వచ్ఛందమగు గాలిని పీల్చుటకై నీటిలోనుండి తలకాయను పైకి ఎత్తుటకు ఎంతబాధపడినావో ముక్తికై నీవంత బాధపడినప్పుడే నీవు దానిని పొందగలవు"

రాజకీయ స్వాతంత్ర విషయంకూడా అంతే. విద్యార్థులు జాతియొక్క ఆశారేఖలు. భారతస్వాతంత్రంయొక్క అత్యావశ్యకతను వారు ప్రథమమున గుర్తించాలి. అదిలేకపోతే జీవితము అర్థరహితము. రేయిని దివము అనుసరించునట్లు మిగతాదంతా దానంతటకదే సిద్ధిస్తుంది.

స్వరాజ్యంకోసం విద్యార్థులు పట్టుదలతో పని చేసేటప్పుడు అహింస అనేది ఒక అవసరవిధానమే కాక మతధర్మముకూడనై యున్నదని ఒకనిముసముకూడ విస్మరించరాదు. "దెబ్బకు దెబ్బ" సూత్రం తొందరగా అర్థమవుతుంది. అది మనల నెక్కువదూరం తీసికొనిపోలేదు. దౌర్జన్యం మరింత రక్తపాతంతో కూడిన దౌర్జన్యాన్ని ప్రేరేపిస్తుంది. ఈవిషమఘటనాచక్రం ప్రళయాంతం వరకు పరిభ్రమిస్తూవుంటుంది. పశుబలం యొక్క నిష్ప్రయోజకత్వానికి నేటి యుద్ధం ప్రబల నిదర్శనం. పశుబలం కన్న అహింసయే ఉత్తమమయినదని విద్యార్థులు మనసునందుంచు కొనవలయును. ఓర్పుతోను, పట్టుదలతోను, వారు అహింసా విధానమును అవగతంచేసికోవాలి. అహింసాయోధుని శిక్షణకు సులభమార్గాలు లేవు. అహింసలో రహస్యానికి తావు లేదు. విద్యార్థుల చర్యలన్నియు బహిరంగంగాను, నిందకు దూరంగాను వుండవలెను. అహింస భయము నెరుగదు. యువకులందు ధైర్యవంతులుగాను శౌర్యవంతులుగాను వుండవలెను. ధీరులయొక్క అహింసను విద్యార్థులు అలవరచుకోవాలిగాని పిరికితనమునకు పర్యాయపదమైన బలహీనుల అహింసను వారలవరచుకోగూడదు..

మాతృదేశస్వాతంత్ర్యము యెడల వారికున్న ప్రగాఢమగు కాంక్షలో, విద్యార్థులు పార్టీ రాజకీయాలలో నిమగ్నులు కాగూడదు. విద్యార్థులు రాజకీయాలలో చురుకుగా పాల్గొన వచ్చునా లేదా అనే విషయం చాలా సంవత్సరాలనుంచి కూలంకషంగా చర్చించబడు

తోంది దీనికి జవాబు చాలా చిన్నదిగా వుంటుంది. విద్యార్థులు రాజకీయములందు ప్రగాఢమగు అభినివేశ ముకల్గి యుండవలెను. దేశాన్ని ఎదుర్కొనే వివిధసమస్యలను వారు జాగ్రత్తగా పఠించాలి. జాతిని నిర్మాణంచేసే ఉద్యమాలలో కూడ వారు మగ్నులు కావాలి. అంతేగాని ఎలాటి పక్షరాజకీయాలలోను వారు పాల్గొనకూడదు ఏరాజకీయ పక్షంతోను వారు సాహచర్యం పెట్టుకోగూడదు వారు విద్యార్థి దశలో నుండగా దాని ఎన్నికలతో కూడా ఎలాంటి సంబంధం పెట్టుకోగూడదు వివిధ రాజకీయ పక్షాల దృక్పథాలను వారు గ్రహించడానికి బాగా ప్రయత్నించవచ్చును. స్వతంత్రంగాను ఆలోచించడం అభివృద్ధి చేసికోవాలి. భావదాస్యము పరమ నికృష్టమైన దాస్యం. శాస్త్రీయమయిన స్వతంత్రమయిన ఆలోచనను అభివృద్ధి పరచని విద్యావిధానం లేనిదే యదార్థమయిన ప్రజాస్వామికం అసంభవం.

చతుర్దశాంశ సమన్వితమగు నిర్మాణ కార్యక్రమమును ప్రచురించినప్పటినుంచీ దేశంలోని చాలా ప్రాంతాలనుండి అనేకమంది విద్యార్థులు "పక్ష రాజకీయాలను వెలుపల వుండాలి" అనే అంశాన్ని వివరించవలసిందని నన్ను అడుగుతున్నారు. ఈవిషయాన్నే నేను గాంధిజీతో యిటీవల చర్చించాను. భారతజాతీయ కాంగ్రెసుతో సహా ఏరాజకీయ పార్టీలోను విద్యార్థులు సభ్యులుగా వుండకూడదని ఆయన స్పష్టంగా చెప్పారు. కాంగ్రెసును కేవలం రాజకీయ కక్ష మాత్రమే గాద

నుట వారసత్వమే గత అరవై సంవత్సరాలనుండి భారత స్వాతంత్ర్యం కోసం మొత్తం దేశంతో పోట్లాడే జాతీయ సంస్థ అది యొక్క టికియో అయినప్పటికీ, విద్యార్థులు కాంగ్రెసులో నాల్గణా సభ్యులుగా చేర నవసరంలేదు. కాంగ్రెసు కాంగ్రెసేతర పక్షాలయొక్క ఆశయాలను వారు నిష్పక్షంగా నిర్భయంగా జాగ్రత్తగా పరిశీలించాలి. కాంగ్రెసు గొప్పదని స్పష్టమైనపుడు విద్యార్థులు తమ విద్యార్థి దశ అంతమైనాక దానిలో చేరవచ్చును. విద్యార్థులుగా వున్నప్పుడు వారు స్వతంత్రులుగా వుండాలి గాని రాజకీయవేత్తల భూమిక దాల్చకూడదు. దేశం తగలబడుతూవుంటే వారు చిన్న "నీరోల" వలెవుండాలని దీని భావం కాదు. భారతదేశాన్ని ఎదుర్కొనే అన్ని సమస్యలతో వారు సన్నిహిత పరిచయ మేర్పరుచుకోవాలి. దేశంయొక్క ఉజ్జ్వల భవిష్యత్తులో వారికి నిండు విశ్వాసముండాలి. జాతికి క్లిష్ట పరిస్థితు లేర్పడినప్పుడు వారత్యధిక త్యాగాలు చేయడానికి సిద్ధపడి వుండాలి.

---

## 2 ఐక్యత, క్రమశిక్షణ

పరస్పర స్పర్థలతో విద్యార్థులు వారి శక్తులను వ్యర్థం చేయరాదు. సంయుక్త ప్రతిఘటనా శక్తిని వారు ప్రదర్శించాలి. ప్రస్తుతం రెండు అఖిలభారత విద్యార్థి సంస్థలున్నవనే విషయం నాకు తెలుసు (1) విద్యార్థి ఫెడరేషన్ (2) విద్యార్థి కాంగ్రెసు. విద్యార్థి ఫెడ

రేవల కమ్యూనిష్టులచే నడపబడుచున్నది. విద్యార్థి కాంగ్రెస్ ఇటీవలనే స్థాపించబడి కాంగ్రెసు సేవకులచే నడపబడు చున్నది. విద్యార్థులు చురుకుగా రాజకీయాల్లో పాల్గొనగూడదని గాంధీజీ స్పష్టంగా అభిప్రాయ పడు తున్నప్పటికీ, విద్యార్థులంతా త్రివర్ణపతాకచుట్టూ జేరి కాను ప్రతిపాదించిన నిర్మాణ కార్యక్రమాన్ని అమలులో పెట్టవలసిందని ఆయన కోరుతున్నాడు. అందువల్ల సాధ్యమయినచోట్ల యీ రెండు సంస్థలు కలసిపనిచేయాలి ఇది సాధ్యంకానిచోట విద్యార్థి కాంగ్రెస్, ఫెడరేషన్లు తమకభిమతమయిన జాతీయసేవా కార్యక్రమములను అమలునందుంచవచ్చును. పరస్పర విద్వేషం దూషణలను ఈరెండు సంస్థలవారు విసర్జించాలి.

ఐక్యతతో పాటు క్రమశిక్షణకూడ ముఖ్యమయినది. ప్రస్తుతం విద్యార్థుల జీవితాలలో తగినంత క్రమశిక్షణ లేదని చెప్పడానికి నేను చాలా విచారిస్తున్నాను. పైనించి విధించబడే యాంత్రిక క్రమశిక్షణలో నాకు విశ్వాసంలేదు. అందువల్ల వ్యక్తిత్వానికి భంగంకల్గుతుంది. బెర్ట్రాండుగారు చెప్పినట్లుగా "వెలుపలి వత్తిడివల్ల తెచ్చిపెట్టుకొనేది నిజమయిన క్రమశిక్షణకాదు. వాంఛనీయమయిన లేక తద్వ్యతిరేకమయిన చర్యలను ఐచ్ఛికంగా చేయించు మానసిక ప్రవృత్తులందు చక్కని క్రమశిక్షణ యిమిడియున్నది."

ఈసందర్భంలో కాలక్రమానుకణికం ముఖ్యమయినది. కాలముయొక్క విలువను గుర్తించలేనిజాతి

గౌరవానికి అనర్హమైనవి. వారి కార్యక్రమాలన్నింటి లోను విద్యార్థులు కాలనియమాన్ని అనుసరించాలి.

---

# 3 ఆరోగ్యంఅంటే శ్రద్ధ

"ఆరోగ్యవంతమయిన దేహంలో ఆరోగ్యకరమయిన మనస్సుంటుంది" అనేది ప్రసిద్ధమయిన గురుజనోక్తి మనమింకా సరిగా గుర్తించనంత ప్రధానమయినది. సరియైన ఆరోగ్యం శరీరబలం లేని మనిషి తనకుగాని, సమాజానికిగాని ఉపయోగపడడు అందువల్లనే "ఆరోగ్యమే మహాభాగ్యము" అన్నవాక్యానికి చాలా అర్థంవుండాలి అందువల్ల అరోగ్యంకలిగివుండడమనేది పవిత్రమయినది. విద్యార్థులు ప్రభాతకాలమున దేహపరిశ్రమ చేయాలి. నాఅనుభవాన్ని బట్టి" సూర్యనమస్కారం" విద్యార్థులకు మంచి దేహపరిశ్రమ అని నేను తలుస్తున్నాను. శరీరానికంతటికి అది పరిశ్రమ యిస్తుంది. ఎక్కువ బయట స్థలమవసరంలేదు. ఖర్చు తక్కువ. మాకా లేడిహాస్టళ్ళలో యిది మేము ప్రవేశ పెట్టాము. ఫలితాలు ప్రోత్సాకరంగా వున్నాయి.

నేడు పాఠశాలల్లో, కళాశాలల్లో యివ్వబడే దేహ పరిశ్రమ తృప్తికరంగా వుందని చెప్పడానికి వీలులేదు. సాయంత్రం చేసే డ్రిల్లు, ఆడేఆటలు కాక విద్యార్థులు ఇంటివద్దగాని హాస్టలులోగాని రోజూ వుదయం దేహపరి

శ్రమ చేయాలి. రోజూ పరిశ్రమ చేసేటట్లయితే 15 నిమిషాలు సరిపోతుంది చకచకా నడవడం పరుగెత్తడం, యీదడం, గుర్రపుస్వారిచేయడం కుస్తీపట్లు యివన్ని మంచి దేహపరిశ్రమలు

విద్యాలయాలల్లో చక్కని సామగ్రితోకూడిన "అఖాడాలు" వుండాలి. దేశీయ ఆటలు పరిశ్రమలు మాత్రమే ప్రోత్సహింపబడాలి అవి చౌకగావుంటాయి ఖర్చుతోకూడిన టెన్నిస్, హాకీ, క్రికెట్ వంటి పాశ్చాత్యక్రీడావినోదాలు, భారతదేశంవంటి బీద దేశానికి పనికిరావు. వాలీబాల్ రింగుటెన్నిస్‌లాంటి ఆటలను యీదేశములో బహుళవ్యాప్తి చేయవచ్చు

టీ తాగడం. సిగరెట్లు కాల్చడంలాంటి దురభ్యాసాలకు విద్యార్థు లెక్కువగా నేడు లోనగుచున్నారు. మద్యపానం చేస్తారు. విద్యార్థులని నేననుకోను ఇదేవారిలో వుంటే అది గర్హింపతగింది పల్లెల్లోకూడ తేనీరుపానం నాగరికత క్రిందికి దిగడంచూసినప్పుడు నేను చాలా బాధపడతాను. ఈ అలవాటు జాతియొక్క ఆరోగ్యాన్ని నెమ్మదిగా నాశనంచేస్తోంది. తేనీరు ఉద్రేకాన్ని మాత్రమే కల్గిస్తుంది. అది సత్తువనిచ్చే పదార్థం కాదు. జీర్ణకోశాన్నియావత్తూతల్లక్రిందుచేసే విషపదార్థం మది. "పాలే నెక్కువగా త్రాగండి" అనే ప్రచారం చేయండని విద్యార్థులకు నేను సలహా యిస్తున్నాను. ఆరోగ్యకరమయిన భోజనానికి కావలసిన అన్నిగుణాలు పాలల్లో విశేషంగావున్నాయి. రోజుకు ఒక పౌండుపాలు ప్రతివిద్యార్థి త్రాగాలి.

విద్యార్థులు అతిమాత్రంగా అలవాటైన ధూమపానము దురభ్యాసాల్లోకి మరీ దురభ్యాసం. అది ఒక ఫాషన్‌గా వారు మొదలెడతారు. చివరకు వారి హృదయకోశాలు చెడిపోతాయి. తల్లితండ్రులు పంపేడబ్బు దుబారా అవుతుంది. నా యావత్ శక్తికొద్దీ నేనీధూమపాన దురభ్యాసాన్ని నిరసిస్తున్నాను. భారతదేశంలాంటి వృష్ణదేశంలో ఆరోగ్యానికిచేసే క్షమించరాని అపరాధమది.

తర్వాత సినిమాలకు చిత్రాల యొక్క విద్యాబోధక విలువను నేను గుర్తించకుండా ఉండలేను. దురదృష్టవశాత్తూ, చాలాఫిల్ములు విజ్ఞానబోధకంగావుండక, మనలోని పశుప్రవృత్తులను ప్రకోపింపజేసి సామాజిక నైతిక వాతావరణాన్ని అపభ్రంశం చేస్తున్నాయి. వారి కాలాన్ని, ధనాన్ని, ఆరోగ్యాన్ని సినిమాల కోసం వెచ్చించకుండా, ఈత, తోటమాలితనం, విహారాలు, కుస్తీ, పట్టడంలాంటి కార్యములందు వారు వెచ్చించవలసిందని నేను విద్యార్థులకు సలహాయిస్తున్నాను. సాంఘిక సేవచేసే నిమిత్తం పరిసర గ్రామాల కప్పుడప్పుడు నియమంగా వెళ్ళడం చాలాప్రయోజనకరమైనపని. భారతీయ చిత్రకళ, జానపదనాట్యం, నాటక రచన మొదలైనవి నేర్చుకోవడం కోసం విద్యార్థులు తమ విరామకాలాన్ని వెచ్చించాలి. యువకులు తమ ఆహారం విషయమై అధికశ్రద్ధ వహించాలి. అది చాలా సత్తువనిచ్చేదిగానూ, చౌకంగానూవుండాలి. చేతితోవిసరినపిండి, చేతితోదంచిన బియ్యం, ఘనీనూనె బిల్లుపిండి, పూర

బియ్యం, మిల్లునూనెలు కన్నా ఎక్కువ విటమిన్లను కలిగి యున్నవనే విషయం నేడు నిస్సందేహంగా రుజువయ్యింది. అందుచేత విద్యార్థులు ఆహార శాస్త్రాన్ని పఠించి తమ ఆహారం అరోగ్యకరంగా వుండేటట్లు చూసుకోవాలి. జిహ్వకు రుచిగావుండే సుగంధ ద్రవ్యమగు ఆహారాన్ని మాత్రమే కాని తీసుకోకూడదు. “తినే ఆహారాన్నిబట్టి మనిషి పరిణతి చెందుతాడు” అని గాంధీజీఅన్నాడు. “బ్రతకడానికి మాత్రమే తినాలి; తినడానికిమాత్రం బ్రతకరాదు” అని కూడా మనం వినలేదా. మన బీద దేశంలో అనేకులు తిండిలేక చచ్చిపోతున్నారు, కాని ఎక్కువగా తిని చచ్చేవారుకూడ వున్నారని మనలో చాలామందికి తెలియదు.

ఆరోగ్యాన్ని అభివృద్ధి చేసుకోడానికిగాను విద్యార్థులు నిరాడంబర జీవనం గడపాలి. ఉపచారములను చాలా భాగం తామే చేసుకోవాలి. స్వల్పమైన దేహబాధల నివారణార్థము వారు డాక్టర్ల దగ్గరకు పరుగెత్త కూడదు. డాక్టర్లు “లైసెన్సు కల్గిన హంతకులు” అని బెర్నార్డుషా సరిగ్గా చెప్పాడు. విద్యార్థులు ప్రకృతి చికిత్స విధానాన్ని చదివి తెలిసికొని, మరీ అవసరమైనప్పుడు మాత్రమే వారు మందులువాడాలి. వైద్యశాస్త్రం కూడా వ్యాపార సరళిలోకిదిగింది. పెట్టుబడి, భుక్తిస్వత్వాలు వైద్యాన్ని గుత్తకు తీసికోవడం నిజంగా దురదృష్టకరమైన విషయం.

అన్నిటికన్నా బ్రహ్మచర్యం ఆరోగ్యరక్షణకు అవసరం. వీర్యమును జాగ్రత్తగా పదిలపరచనిదే విద్యార్థులు ఆరోగ్యకర దేహాలను కల్గియుండజాలరు. ఇంద్రియ

నిగ్రహము ఇంద్రియలోలత్వముకాదు. ఆరోగ్యానికి ప్రథమ సూత్రం. పాశ్చాత్యవిజ్ఞానికి పరవశులై ఒడలు తెలియక యింద్రియలోలత్వమే పూర్ణజీవనమని యువకులు భ్రమించారు ఇది శుద్ధతప్పని అనుభవం చెబుతోంది. ఎంతతొందరగా యిది మనం తెలిసికొంటే అంతమంచిది. ఇంద్రియ వ్యాపారములను పూర్తిగనిగ్రహించమని నేను సూచించడంలేదు. బ్రహ్మచరను ఆత్మనిగ్రహముల యొక్క విలువను నేనతిశయోక్తులతో నభివర్ణించుట లేదు

గాంధీజీ ఆరోగ్యానికి అధికప్రాముఖ్యత నిస్తాడు. ప్రతిరోజూ మూడుగంటలాయన నడవడానికి, దేహమర్దనకు, స్నానానికి వినియోగిస్తాడు. బహుజాగ్రత్తగా రక్షించవలసిన ధర్మనిధిగా భావిస్తాడాయన తనదేహాన్ని ఆగాఖాను మందిర నిర్బంధావాసంలో ఆయన ఒకే ఒక పుస్తకం వ్రాశాడు. దానిపేరు "ఆరోగ్యసూచిక" తొందరలోనే యీ పుస్తకం ప్రచురింప బడుతుంది. విద్యార్థులంతా దానిని శ్రద్ధగా పఠించవలసిందని నేను సలహా యిస్తున్నాను.

## 4. ఖద్దరు గ్రామపరిశ్రమలు

ఖద్దరు, గ్రామపరిశ్రమలను గూర్చిన గాంధిగారి భావాలు మధ్యయుగాల నాటివని సనాతన ఆర్థికశాస్త్రవేత్తలు తలుస్తున్నారు. గ్రామమును పునరుద్ధరించు

టలో ఆయన కాలచక్రాన్ని వెనుకకు త్రిప్పుతున్నాడని వారు భావిస్తారు. గాంధిగారి ఆర్థిక శాస్త్రం అనుష్ఠానయోగ్యం కాదని, స్వప్న తుల్యమని భావించబడిన కాలంగూడా వుంది. ఈ దేశంలోను, ఇతర దేశాలలోను యిటీవల కలిగిన అనుభవాన్ని బట్టి, ఖద్దరు, యితర గృహపరిశ్రమలు అంతరార్థమునుగూర్చి శ్రద్ధగా పరిశీలించవలసిన అవశ్యకత యేర్పడినది. ప్రొ॥ కోల్ వంటి సుప్రసిద్ధ పాశ్చాత్య ఆర్థిక శాస్త్రజ్ఞులు ఖద్దరు పరిశ్రమ విషయమై గాంధీజీ చేసే ప్రచారం ప్రాత పద్ధతులను పునరుద్ధరించడానికి చేసే ప్రయత్నంగాక, భారత గ్రామీణుల జీవన ప్రమాణం హెచ్చించడానికి చేసే సంరంభమని భావిస్తున్నారు. గాంధేయ ప్రణాళిక ప్రథమ భాగంలో ఖద్దరు ఏ విధంగా శాస్త్రీయమైనదో చూపించడానికి నేను ప్రయత్నం చేశాను. అది గాంధీజీ యొక్క ఛాదస్తపు సిద్ధాంతంకాదు. అహింస, అనేది నిరాడంబరత్వం ధర్మముల మీద ఆధారపడిన ఒక నూతన ఆర్థిక సామాజిక వ్యవస్థను ప్రతిపాదించుచున్నది. ఆర్థిక సంఘజీవదృక్పథముల నుండియేగాక మానసిక శాస్త్రం జీవశాస్త్రం, వ్యవసాయశాస్త్రం, రాజకీయ ప్రజాస్వామికం, నిరుద్యోగం, జాతిసురక్షణ దృక్పథముల నుండి పరిశీలించిన అది వాంఛనీయమే యగుచున్నది. ఖద్దరు, గృహ పరిశ్రమోద్యమముల భావముల విశదీకరించడం యీ చిన్నపొత్తముల యొక్క ఉద్దేశము నేడు విద్యార్థులు యీసమస్యను శాస్త్రీయ దృక్పథంతో పఠించాలని చెబితే సరిపోతుంది. ఆ విధంగా చేస్తే

వికేంద్రీకరణ గృహపరిశ్రమల మీద ఆధారపడిన ఒక నూతన నాగరికత కదలివస్తున్నదని వారు తెలుసుకుంటారు. గృహపరిశ్రమలే, శాంతి, సౌభాగ్య, రక్షణలను కల్గించే నూత్న శకోదయారంభం చేయగలవని పాశ్చాత్య తత్వ వేత్తలుగూడా యిటీవల భావిస్తున్నారు.

చర్ఖా ఆర్థిక శాస్త్రం నిరాడంబర జీవనం ఉన్నతాలోచనలమీద నాధారపడియున్నది. భౌతిక సుఖముల భోగములమీదనే యథార్థమగు సుఖము ఆధారపడి యుండ లేదని అది చెబుతోంది. వైజ్ఞానిక, ఆధ్యాత్మిక విషయముల కన్న భౌతిక ఆర్థిక ప్రాధాన్యమిచ్చు సనాతన పాశ్చాత్య ఆర్థిక విషయములకు శాస్త్రముకన్న నది విభిన్నమైనది. గాంధీజీ యిలా చెబుతున్నారు. "మనస్సు నిశ్శాంతి యెరుగని విహంగమువంటిది. ఎక్కువ లభ్యమైన కొలది అది యింకా యెక్కువ వాటిని వాంఛిస్తుంది. అది తృప్తియనునదెరుగదు" "విషయ సౌఖ్యములలో మన మెంత యెక్కువగా నిమగ్నులమగుదుమో అవి అంత విశృంఖల విహారము చేయును." సౌఖ్యమనునది ముఖ్యంగా మానసిక స్థితియని మనపూర్వులు భావించారు. అందువల్ల వారు మనలను భోగములనుండి విలాసములనుండి మళ్ళించారు. బాగా ఆలోచించి చేతులతో కాళ్ళతో మనం చేయగలిగినంత చేయాలని వారు చెప్పారు, చిరకాలముల ఉపరతి ప్రయోగమందే వాస్తవసౌఖ్యమున్నదని వారు భావించారు. అవసరములను యథేచ్ఛగా పెంచినందువల్ల ప్రపంచము తన గమ్యస్థానమువద్దకు కాక అపమార్గమును వెళ్ళు

తోందని గాంధిజీ విశ్వసించుటలేదు. "దూరమును కాలమును తగ్గించి పశువాంఛలను హెచ్చించి వాటి తృప్తికై భూతలం యొక్క కొనలకు వెళ్లడంలోగల ఉన్మత్త వాంఛను నేను సహ్యించుకొంటున్నాను" అని గాంధిజీ అన్నాడు. డబ్బుకోసం జాతీయ పదార్థాలకోసం పిచ్చిగా పోటీలు పడటంవల్ల ప్రపంచం రక్తపాతంతో గూడిన యుద్ధాలలోను, నిర్దయతో కూడిన వినాశమనే సుడిగుండంలోను పడిందనేది యదార్థం. అర్థసంగ్రహణమే మనజీవిత పరమావధియైపోయినది. కాంచనంకోసం ఎంత పెనుగులాడిన మైడాస్ రాజుకథ మన కందరికీ చిరపరిచితమే. దీనినుండి మనమొక గుణపాఠం నేర్చుకోవాలి. మానవత్వ స్పృహను కోల్పోయి కాంచనానికి మనం ప్రాధాన్యమివ్వకుండాలంటే యిదిచాలా అవసరం. ఇక నిష్కపటులై ఆరోగ్యవంతులై విజ్ఞానవంతులై నిస్వార్థులైన స్త్రీపురుషులే ఒకజాతికి నిజమగు సంపదగాని అందమైన వస్త్రాలు అంబరచుంబిత సౌధాలు, పెద్ద కర్మాగారాలుగావు. ఈనూతన జీవన క్రమానికి ఖద్దరు దారితీస్తుంది.

శ్రమయొక్క పవిత్రతను, హోదాను ఖద్దరు శాస్త్రం నొక్కి చెబుతుంది. శ్రమను తగ్గించుకోడానికి గల ఉపాయాలను వెదకడంలో, జీవయంత్రాలను [మానవదేహాలను] తుప్పుపట్టేటట్లుచేసి వాటిబదులు నిర్జీవ యంత్రాలను వాడుతున్నాము. సెంట్ పాల్ యిలా అన్నాడు "పనిచేయనివాడు భోజనం చెయ్యగూడదు." గీత యిలా చెబుతోంది. "శ్రమచేయకుండా

భూదేవిసారాన్ని అనుభవించేవాడు యీలోకంలో చోరునివంటివాడు." కష్టపడి తనభోజనం తాను చెయ్యాలని" గాంధిజీ అంటున్నారు- "కర్మయే ఆరాధన" "సోమరిపోతు మనస్సు సైతాను కర్మాగారము."

అందరికి పూర్ణమగు ఉద్యోగం కావాలని ఆధుని కార్థిక శాస్త్రజ్ఞులు చెప్పేదాన్నిబట్టి చూచిన, సమగ్రమైన పారిశ్రామిక విధానంకూడ నిరుద్యోగ సమస్యను పరిష్కారం చెయ్యలేదు. పారిశ్రామిక దేశాలైన అమెరికా, ఇంగ్లండులలో నిరుద్యోగం ఎక్కువగావుండి, నిరుద్యోగులంతా ప్రభుత్వం యిచ్చే భత్యాలమీద జీవించాల్సి వస్తోంది. 1939 లో అమెరికాలోని నిరుద్యోగుల సంఖ్య 60 లక్షలకు పైచిలుకు. 1931 జనాభా లెక్కల ప్రకారం భారతదేశంలో కనీసం 2 కోట్లమంది నిరుద్యోగులున్నారు. వీరుగాక మిగిలియున్న కొలది గ్రామీణులు అర్ధోద్యోగు ల్యో, లేక చాలీచాలని భూములమీదనో జీవిస్తున్నారు. పాశ్చాత్య ప్రమాణాల్ననుసరించి, ఇండియాలో నూటికి 50 మంది నిరుద్యోగులనియే మనం భావించాలి. ఈదేశంలో 100 కి 90 మంది వ్యవసాయం-దానికి సంబంధించిన వృత్తులలో నున్నారు 100 కి 10 మంది పరిశ్రమలలో నున్నారు. ఇందులో 20 లక్షలమంది మాత్రమే పెద్దపరిశ్రమల్లో పని చేస్తున్నారు. ఈపరిశ్రమలు అభివృద్ధి అయినప్పటికీ మొత్తం జనాభాలో 100 కి 5 మందికన్న ఎక్కువమందికి పూర్తి పని కల్పింపబడదు.

భారతదేశంలో భారత పరిశ్రమలు, పెట్టుబడి దారీ విధానం మీదగాని, సామ్యవాద విధానంమీద గాని, పెట్టుబడినప్పటికి నిరుద్యోగ సమస్యను పరిష్కారం చేయజాలవు. అందరికి పనిఉండాలంటే గ్రామపరిశ్రమల పునరుద్ధరణ అతిప్రధానమైనది. వ్యవసాయానికి సహకారంగా అందరికీ ఉపయోగించే గృహపరిశ్రమ ఖద్దరు. సంవత్సరంలో ఆరుమాసాలు సోమరితనంగా వుండే గ్రామీణుల చేతుల్లోకి దానివల్ల డబ్బు చేకూరుతుంది.

ఖద్దరు ఉద్యమం చాదస్తం కాదని చెప్పడానికి కొన్ని ఆధారాలుగలవు దానిఅంతరార్థం గంభీరమైనది, శాస్త్రీయమైనది. దాని ఆర్థిక విలువనట్లావుంచి, పండిత జవహర్లాలు నెహ్రూ చెప్పినట్లు భారత స్వాతంత్ర్య సాధకుల చిహ్నంగా అది మన యువకులచేత ధరించబడాలి.

విద్యార్థులు నూలు వడకడం అభ్యాసం చేసుకోవాలి. ఎందువల్ల? అని సహజంగా ఒక ప్రశ్న వస్తుంది.

కారణాలివి:—

i నూలువడకడం నిరాడంబర జీవనచిహ్నం.

ii శ్రమశక్తి హోదాను అభివ్యక్త పరుస్తుంది.

iii మానవజీవనంయొక్క ఆర్థిక స్థితిసది నొక్కి చెబుతుంది.

iiii మన దుస్తుల వరకైనా మన నదిస్వాతుం సంపూర్ణం చేస్తుంది.

v శ్రమజీవులతో అద్వైతభావాన్ని దీనివల్ల మనం సాధించగలము

vi మన మనస్సులకు ఆరోగ్యాన్నిస్తుంది.

విద్యార్థులు నిత్యం పఠనం పఠనమే గాకుండా చరిత్ర, తర్కీ శాస్త్రాలలో పరిశోధనకూడా సాగించాలి. శాస్త్ర విద్యార్థులవలె వారు కూడా అమలులో వున్న వసతికే సాధనాల నభివృద్ధి పరుస్తానికి ప్రయత్నించాలి

ఇతర గృహపరిశ్రమల ఆర్థిక సౌష్ఠవం గూడ ఖద్దరునే పోలియున్నది. గృహపరిశ్రమలలో తయారైన వాటినే విద్యార్థులు సాధ్యమైనంతవరకు వాడాలి. చేతితో విసిరిన పిండి, బియ్యం, ఘానినూనె, గర్ మొదలైన వాటిని వారు వుపయోగించాలి! వారు వీటిని పోషించినందువల్ల తమ ఆరోగ్యం బాగుపడటమే గాకుండా బీదలగు గ్రామీణుల ఆర్థిక సహాయము కూడా చేసినవారగుచున్నారు, చేతికాగితాన్ని విద్యార్థులు సాధ్యమైనంతవరకు వాడాలి. అన్ని జీవనరంగాలలోను వారు గృహపరిశ్రమలను పోషించే అభ్యాసం చేసికోవాలి ప్రస్తుతం డబ్బు గ్రామాలనుండి పట్టణాలకు పోతున్నది. గ్రామాలను వర్తక పరిశ్రమలకు కేంద్రాలుగాజేసి యీ ఆర్థిక శోషణను ఆపివేయాలి.

మిల్లుగుడ్డలు, వస్తువులకన్న ఖద్దరు, గృహపరిశ్రమలలో తయారయ్యే వస్తువులు ప్రియములని ప్రజలు చెబుతారు. తమ స్వార్థంకోసం నిర్దాక్షిణ్యంగా సమాజాన్ని దోపిడీచేసే పూంజీపతుల బనియాల జేబుల్లోకి మిల్లుగుడ్డలు, వస్తువుల కోసం మనం ఖర్చుపెట్టేడబ్బు వెళ్ళుతోందని ఎవరూ గ్రహించడంలేదు. భాగ్యవంతుని మరీ భాగ్యవంతునిగ జేయుటలో విద్యార్థులమైన మనకేమి అభిరుచివున్నది? ఖద్దరు, గృహపరిశ్రమల

కోసం మనం వెచ్చించే డబ్బు మన మాతృభూమిలో అర్థాకలితో కృశిస్తూ అర్థ దిగంబరులైన వారికి ఉపకరిస్తుంది. కనుక విద్యార్థులు ఖద్దరును గృహపరిశ్రమలలో ఉత్పత్తియైనవాటిని వాడటం విస్మరించకూడదు. దానివల్ల వారు వస్త్రములు మొదలైన జీవితావసరములను తాము తెచ్చుకొనడమే గాకుండా బీదలైన గ్రామీణుల స్వల్పాదాయములను పెంచి వారికి సేవ చేసిన వారగుచున్నారు. గృహపరిశ్రమోత్పత్తుల కొనడం వీలుగానిచోట్ల విద్యార్థులు స్వదేశీవస్తువులను వాడాలి. భారతదేశాన్ని బ్రిటిషు సరుకులతో నింపివేయాలని బ్రిటిషు ప్రభుత్వం బ్రహ్మాండమైన ప్రయత్నాలు చేస్తున్నది. భారతవిపణివీధిని పట్టుకొందామని అమెరికనులుగూడా ప్రయత్నంచేస్తున్నారు. యుద్ధానంతరం యీ విధానం మరింత తీవ్రతరం చేయబడుతుంది. కాబట్టి భారత కొనుగోలుదారులు జాగ్రత్తగా ఆలోచించి వ్యయంచేయాలి "చౌకగా వచ్చే విదేశవస్తువులను కొందామనే వలలో వారు పడితే భారతపరిశ్రమలు సర్వనాశనమౌతాయి. స్వదేశీవస్తువులనే కొని విద్యార్థులీవిషయంలో అజ్ఞానులగు ప్రజానీకానికి ఆదర్శం చూపించాలని నేను కోరుతాను. భారతదేశంలో ఉత్పత్తిగాని కొన్నివస్తువుల విషయంలో మనం మినహాయింపు చేసికోవచ్చు. అలాంటి మినహాయింపులను చాలావరకు తగ్గించాలి.

---

# 5 గ్రామ సేవ

శిథిలమై అంధకార మయమైన గ్రామకటీరము లలోనే నిజమైన భారతదేశమున్నది. మన జనాభాలో 80% గ్రామములందు నివసించుచున్నారు. కనుక ఏజాతీయ పునర్నిర్మాణ కార్యక్రమమయినా గ్రామ సౌభాగ్యావసరములకు సంబంధించినదయి యుండవలెను. జాతీయ సేవ అనేది అస్పష్టమయిన భావంగా వుండ కూడదు. భారతజాతి ఎక్కువగ గ్రామాలలో వుండ టంచేత జాతీయసేవ అనే పదానికి అర్థం గ్రామీణసేవ అని.

విద్యార్థులు వారికేవిధంగా సేవచేయగలరు? వారి సమయంలో కొంత భాగం మాత్రమే వారు గ్రామసేవ చేయగలరనేది సువిదితం. వారిస్థానిక పాఠ శాలలతోను, కళాశాలలోను గ్రామసేవా సంఘాలు స్థాపించడంతో వారీపని ప్రారంభించాలి. నాప్రేరణతో మాకళాశాలలోని విద్యార్థులు యిలాంటి సంఘం నొక దాన్ని స్థాపించారు. అది పరిసర గ్రామాల్లోమంచి పనికొనసాగిస్తోంది. వార్ధాతాలూకాలోని గ్రామాల యొక్క ఆర్థిక సామాజిక స్థితినిగూర్చి ఆచార్యబంగీ గారి నాయకత్వం క్రింద యీసంఘసభ్యులు పరిశీలన ప్రారంభించారు. పరుపులు వీపుమీద కట్టుకొని వారు గ్రామ గ్రామానికి కాలినడకమీద వెళ్ళేవారు. వారు స్వయంపాకం చేసుకునేవారు. సేవకుల వసతియందు

లేకుండా తమ పనిని తామే చేసుకునేవారు. ఇట్టి గ్రామ పరిశీలనా కార్యం విద్యార్థులకు నూతనానుభవం చేకూర్చింది వారి పాఠ్యగ్రంథాలలో చదవలేని అనేక అద్భుత విషయాలు నేర్చుకొన్నారు. ఈపనివారి చదువులను అనుష్ఠానయోగ్యమగు పంథాలో పెట్టినది. సంఘ జీవితముయొక్క యదార్థ పరిస్థితులను వారర్థంచేసుకునేలా చేసింది,

షుమారు అరడజను గ్రామాల్లో యీసంఘము నిజమయిన సాంఘిక కార్యక్రమం ప్రారంభించింది. విద్యార్థులు ముందు ఆగ్రామాల్లో పాఠశాలలకు వెళ్లే విద్యార్థుల విషయమయి ప్రతి సాయంత్రము కళాశాల విద్యార్థులదళ మొకటి ఒక్కొక్క గ్రామం వెళ్ళేది. గ్రామంలోని పిల్లల కులాసా కొరకు జాతీయములగు ఆటలను వారు ఏర్పాటు చేసేవారు. క్రీడావినోదానంతరము వారంతరు కలసి జాతీయ గీతాలుపాడేవారు, గ్రామంలోని పోలీసు ఉద్యోగస్థులు మొదట అనుమానించి సాయంత్రపు కార్యక్రమానికి విఘాతం కల్గించడానిక్ ప్రయత్నించేచారు. కాని వారు తొందరలోనే స్నేహభావ పూరితులయ్యారని రెండుమాసాలు గడచిన తదుపరి కళాశాల ఆటస్థలములందు అంతర్గ్రామ పోటీపందాలు జరిపేవారు. ఈపనివల్ల గ్రామంలోని పిల్లలకు మంచి అభిరుచి కల్గడమేకాక అనేకమంది కాలేజి విద్యార్థులుకూడ గ్రామసేవా సంఘంలో చేరారు. ఈఆటలతోపాటు గ్రామంలోని పిల్లలకు ఆరోగ్యం, భాతృత్వం క్రమశిక్షణ మొదలగు విషయాలు బోధించబడ్డాయి.

గ్రామంలోని పెద్దలకు వైద్య సహాయంచేయబడింది. చౌకగాఉండే ఆయుర్వేద మందులు వారికి పంచిపెట్టబడ్డాయి. యీ సేవాసంఘ సభ్యులే కొన్ని ఆయుర్వేద మందులు తయారుచేసారు. ప్రకృతిచికిత్స పారిశుద్ధ్యమును గురించిన భావాలు ప్రచారంచేసారు. తమ పిల్లలఎడ శ్రద్ధతీసుకునే సరికి పెద్దలుకూడ యీ సంఘమువారు చేసే మానవ కారుణ్య కార్యము ఎడల ఆకర్షింపబడి, యీసంఘమువారు కొనసాగించే పునర్నిర్మాణ కార్యక్రమానికి చేయూతను క్రమంగా యివ్వ మొదలిడినారు. విద్యార్థులుచేసే గ్రామ పారిశుద్ధ్యపు పనియందు పెద్దలు సాయంచేయ మొదలిడారు వయోజన విద్యాప్రచారం కోసం భజనమండలులు మొదలుపెట్టారు.

కేవలము అక్షర ప్రచారము చాలదు. అది ఒక సాధనం కాని, సిద్ధి మాత్రంకాదు. వయోజన విద్య ధర్మము ప్రజలయొక్క ఆర్థిక వైజ్ఞానిక స్థాయిలను హెచ్చించటానికి వుపయోగపడాలి. కాని చదువను, వ్రాయను, లెక్కకట్టను నేర్పుటకు మాత్రమే కాదు. ఒక మనిషియొక్క అభిరుచులు నిశితంగావున్నపుడే అతను బాగా నేర్చుకొంటాడు అందువలన ఆర్థిక విషయాల్నుంచి ప్రారంభించుటకు మంచి బోధనక్రమము సహకార పద్ధతిమీద కుటీర పరిశ్రమల వ్యవస్థీకరణ ద్వారా వయోజనులకు విద్యాబోధ చేయబడాలి. అలాంటి వుపయోగకరమయిన ఆర్థిక కార్యక్రమం ద్వారా వీరు జ్ఞానోపార్జన చేసినట్లయితే అది

వారికి చాలాలాభంగా వుంటుంది. ప్రయోజన కరమయిన ఆయావిషయాల్ని గూర్చి, అభిరుచిగా వుండే కరపత్రాలను చవుకగా వారి కందజేయాలి. అప్పుడు వీరుస్వచ్ఛందంగా చదువను వ్రాయను లెక్క-గట్టను నేర్చుకుంటారు. క్రమంగా ఆరోగ్యం, పారిశుద్ధ్యం పౌరసత్వపు హక్కులు, సమిష్టి ప్రయత్నాలను గురించిన, సంయక్ పరిజ్ఞానాన్ని వారుపొందుతారు. స్వదేశీ నాట్యాభి నయసాహిత్య సంగీతకళాపునరుద్ధరణ, వయోజన విద్యా క్రమంలో ఒకభాగంగా వుండాలి.

ఈ వయోజన విద్యా కార్యంలో పాఠశాలలోని కళాశాలలోని బాలికలుకూడా ప్రముఖ పాత్రవహించ గలరు. నాజూకు దుస్తులు వేసుకుని సీతాకోక చిలుకల లాగా తయారయ్యేదాని కన్నా వారు యీ విధంగా గ్రామాలలోని స్త్రీలకొరకు విద్యా విజ్ఞాన జ్యోతుల తీసుకు పోగలరు. ఏ నిర్మాణకార్యక్రమమయినా దృఢతరంగా, చిరస్థాయిగా వుండాలంటే జాతికి మాత లయిల స్త్రీలవద్ద కదివెళ్ళ వలయును. స్త్రీల సహాకారం లేనిదే మనంచేసినది వ్యర్థమవుతుంది. కస్తూరిభాయి జాతీయస్మారకనిధి సంఘముకారు సూచించిన గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమాన్ని బాలికలు అర్థం చేసుకొని ఆచరించాలి. గ్రామోద్ధరణ కార్యంలో చురుకుగా పాలు తీసుకొని మాతృభూమికి ప్రయోజన కారు లుగా వారు తయారవ్వాలి.

మా కళాశాలలోని గ్రామ సంఘము వారు తయారుచేసిన ప్రశ్నావళిని విద్యార్థుల వుపయోగం కొరకు యీ పుస్తకం చివరయిచ్చాను.

---

# 6 రాష్ట్ర భాషాభ్యసనము

అంతర్ రాష్ట్రీయ వ్యవహార నిర్వహణ కోసం మన దేశానికి ఒకరాష్ట్ర భాషఅవుసరం. ఈ సామాన్య భాష ఆంగ్లముయి యుండకూడదనే విషయము సుస్పష్టం. గత శతాబ్దము నుండి ఆంగ్లభాష నేర్పబడుతున్నప్పటికి మన దేశంలో నూటికి ఒకరుమాత్రమే నేర్చుకోగల్గారు. కాని ఆంగ్లము ఎడల మన కున్న వింతయైన అభిమానాన్ని పురస్కరించుకొని యీ దేశంలో ఒకవిచిత్రమయినపరిస్థితి ఏర్పడింది. ఎంతతప్పుడు తడబాటుగావున్నా మనలో మనము యింగ్లీషులోనే మాట్లాడు కోవటం నేర్చుకన్నాము. నేను యింగ్లండులో వున్నప్పుడు నన్ను ఒక యింగ్లీషు స్త్రీ యిలా అడిగింది. "మీకొక రాష్ట్ర భాష లేదా?" "ఎందుకు లేదని నేజవాబిచ్చాను" "అలా అయితే హిందూదేశీయులు ఒకరికొకరుతో ఇంగ్లీషులో ఎందుకు మాట్లాడుకుంటారని" ఆమెనన్ను ప్రశ్నించింది సరియైన సమాధాన మివ్వలేక సిగ్గున తలవాయువంచు కోవలసివచ్చింది మనపరస్పరసంభాషణలో వుపయోగించే యింగ్లీషుభాషచూచి ఏయింగ్లీషు పెద్దమనిషీ

మనసు మెచ్చుకోజాలదని నా యింగ్లండు అనుభవంలో తేలింది. మనకొక దేశీయమైన సామాన్యభాష లేనందుకు అతను చాల అసహ్యించుకుంటాడు. ఇంగ్లీషు భాష ఎడల వ్యామోహాన్ని మనమెంత తొందరగా తగ్గించుకుంటే మనకు, మనజాతికి అంతమంచిది.

మనరాష్ట్ర భాషఒక స్వదేశీ భాష అయివుండాలి. మన అంతర్గత భాష ప్రకటనకు ఒక విదేశీ భాష ఎప్పుడూ వుపయోగ పడజాలదు. 1925లో కాన్పూరులో జరిగిన భారతజాతీయ మహాసభవారు మన రాష్ట్ర భాషను హిందూస్థానీ అని పిల్చారు. ఉత్తరహిందూదేశ మందలి గ్రామాల్లోని హిందువులు మహమ్మదీయులు అర్థంచేసుకనివాడుకనే భాష అది. దేవనాగరి, పర్షియా లిపులలో అది వ్రాయబడుతుంది. హిందీ, వుర్దూ రెండూ దీని సాహిత్య శైలులు. అందువలననే గాంధిజీ రెండూ శైలులలోను, రెండు లిపులలోను హిందూస్థానీ నేర్చుకోవాలని నొక్కి చెపుతున్నారు.

దురదృష్టవశాత్తు మనదేశంలో యీరాష్ట్రభాష సమస్య వివాదాస్పదమయింది. సాంఘికమయిన రంగును కూడా దాల్చింది. హిందువులుహిందీ, మహమ్మదీయులు వుర్దూ కావాలంటారు హిందీని మరింత సంస్కృతభూయిష్టం చెయ్యాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి వుర్దూను మరింత పర్షియమయం చెయ్యాలనే ప్రయత్నం జరుగుతూంది ఈరెంటిమధ్య కల అఖాతాన్ని దాటాలంటే హిందీ వుర్దూ శైలుల రెంటిని సులభీకృతం చెయ్యవలసిన అవసరంవుంది. ప్రజాసౌఖ్యమే

మన ఆదర్శమయినచో భాషలు సులభం చెయ్యబడాలి సహజభూయిష్టమయిన భాషను పరిణామీకరం రద్దుచేసు కోరాదు.

హిందీ వుర్దూలు సులభంచేయబడినచో హిందూ స్తానీ భాష పరిమితి చెందుతుంది. హిందీ వుర్దూలలో వున్న సులభమయిన పదాలన్నీ యిందులో వుంటవి. ఇతర దేశీయ భాషలలోవున్న సులభపదాలుకూడా యిందులో వుంటవి. హిందూస్థానీ అనేది సరలంగా పరి ణామం చెందాలి. కృత్రిమమయిన మిశ్రమాన్ని దేశం మీద రుద్దలేము. హిందూస్థానీ వుద్యమాన్ని చూచి హిందీ, వుర్దు రచయితలెవరు అవమానపడకూడదు. మనలోవున్న విభేదాలను తగ్గించుకొని రాష్ట్ర భాషా ప్రచారంకోసం మనం వుత్సాహంతో పనిచేయవలసిన కాలం వచ్చింది. హిందీ వుర్దూ రచయితలు పరస్పర తగాయిలదాకు నిమగ్నులయినచో ఆంగ్లభాషను ప్రస్తుత స్థితినుండి వూడబెరకడం చాల కష్టసాధ్యమవుతుంది.

అనారోగ్య కరమయిన భాషావిషయక వివాదు లలో విద్యార్థులు పాల్గొనడం తగదు. హిందూస్థానీ భాషను రెండు శైలులలోను కాదు, లిపులలోను వారు నేర్చుకొనడం ప్రారంభించాలి. ఆంగ్లభాషఎడల తమకు గల్గిన అసహజాభిమానాన్ని వారు తగ్గించుకోవాలి. వివిధ భాషాప్రాంతాల్లో వారు తిరుగుతున్నపుడు హిందూస్థానీలో మాట్లాడ్డం ఒక నియమంగా చేసుకో వాలి. వార్ధాలోవున్న హిందూస్తానీ ప్రచారసభ కార్య దర్శితో వీరు సంబంధముంచుకొని యీ రాష్ట్రభాషను

తొందరలో నేర్చుకోడానికి ఒకరితో ఒకరు పోటీపడాలి వారే భాషను తమకు తామే నేర్చుకొనే పూరుకుండ రాదు వారితరులకు కూడ సాధ్యమయినంత వరకు నేర్పాలి. దేశంలో ఐకమత్యాన్ని, భాతృత్వాన్ని హిందూస్తానీ ప్రచారం అభివృద్ధి చేస్తుంది. అఖిలభారత సమావేశాలు ఒక స్వదేశభాషలో జరుపబడి మనల గాఢంగా వున్న అభిప్రాయాల్ని వెలిబుచ్చడానికి తోడ్పడుతుంది.

---

## 7 మాతృభాషాభిమానం

మనమంతా రాష్ట్రభాష నేర్చుకొనవలెనంటే మాతృభాషలను మరచిపోవలెనని అర్థంకాదు. ఒకవంక ఏకభాషా ప్రచారము చేస్తూకూడా దేశభాషలు కుంటు పడకుండా చూడవలసిన బాధ్యత హిందూస్థానీ ఉద్యమ సంచాలకులపై ఉన్నది. అంతేకాదు; దేశభాషలు సక్ర మముగా అభివృద్ధిచెంది ఉచ్చస్థాయిని అందుకో గలుగు టకుగాను తగినంత ప్రోత్సాహము కూడ ఇవ్వవలసి యున్నది.

కళాశాలలో పాఠ్యగ్రంథములను ఆంగ్లభాషలో బోధించు పద్ధతిని ప్రవేశపెట్టి మెకాలేప్రభువు మన దేశానికి తీరని అపకారం చేశాడు. అందుమూలాన విద్యార్థులకు విషయము సుబోధకము కాకపోవటము అలా ఉండగా... వారి ఉపజ్ఞ నశిస్తున్నది. ఆవ్యాఖ్యాత భావప్రకటనశక్తి అలవడటంలేదు.

"మనము పసితనాన తల్లియొడిలో ఉండి పలుక నేర్చినభాష- ప్రప్రథమంగా మన హృదయంలోని ఆనంద విషాదాలు వాచా బహిర్గతమై వచ్చినభాష- అట్టి మాతృభాషే సుగమంగా హృదయస్పర్శియైనది. పదము ఉచ్చరితంకాగానే దాని భావమున్నూ తత్‌క్షణమే అనుభూతమౌతుంది అట్టి మాతృభాషలోగాక మరి యితర భాషలో బోధించటము విద్యార్థిని అనవసరంగా బాధించటమే అందువల్ల అతని ఆలోచనా శక్తి, భావస్వాతంత్ర్యము కుంటివడిపోగలవు"—అని ఒక ప్రఖ్యాత ఆంగ్లేయ రచయిత హెచ్. యన్. బ్రెయిల్స్‌ఫర్డు అంటున్నాడు.

గాంధిమహాత్ముడు కూడా ఇలా అన్నాడు— "పసిబిడ్డ ఆరోగ్యంగా పెరగటానికి తల్లిపాలు ఎంతగా ఉపకరిస్తాయో మానవుని మనోభివృద్ధికి మాతృభాష అంతగా సహాయకారి కౌతుంది. కాదామరి! పసిబిడ్డ తన ప్రథమ పాఠాన్ని తల్లియొడిలో అభ్యసిస్తుంది. కాగా పిల్లల మనోవికాసానికి మాతృభాషద్వారా గాక అన్యభాషలద్వారా ప్రయత్నించటము మాతృదేశంపట్ల అపచరించటమన్నమాటే ✓ఈనగ్నసత్యాన్ని కొంచెం దీర్ఘంగా ఆలోచించిన మీదట విద్యాభిమానులంతా గుర్తించగలుగుతారు."

బాలబాలికల విద్యాభ్యాసము ఆంగ్లభాషలోనే కొనసాగవలెనని వాదించేతల్లిదండ్రులు, ఉపాధ్యాయులు ఈనాడుకూడా చాలమంది ఉన్నారు ఉదాత్తములు, వైజ్ఞానికములు అయిన భావాలకు అనుగుణ్యమైన భాష

ఆంగ్లమే నని వారి ఉద్దేశము. విద్యార్థులకు దేశభాషల్లో బోధించటము తమ మర్యాదకు లోపమని మన ప్రొఫెసర్ల భావన. ఈ ఆచార్య శిఖామణులు కొన్ని విశ్వవిద్యాలయాలలో దేశభాషా సాహిత్యాలను గురించి కూడా తాము దివ్యభాష, అని భావిస్తూన్న ఇంగ్లీషులోనే ఉపన్యసిస్తారు. సంస్కృతము, హిందీ, మహారాష్ట్రము, మొదలైన దేశభాషల ప్రశ్న పత్రాలు ఆంగ్లంలోనే ఉంటున్నవి ఇదంతా ఎటువంటి నవ్వులాట [illegible] చూడండి! ఈ సంగతులన్నీ 'హాస్యరస తరంగిణి' అనీ 'నమ్మండి, నమ్మకపోండి' అనీ శీర్షికల క్రింద రాయదగినవి.

ఆంగ్లభాష మన దేశంలో విద్యాధికులనబడేవారికీ సామాన్య ప్రజకూ మధ్యన మహాదంతరాన్ని కల్పించింది. విశ్వవిద్యాలయాలలో 'డిగ్రీలు' కొని తెచ్చుకున్న మన యువకులు... అన్నవస్త్రాల కరువుతో కృశిస్తూన్న లక్షలాది దేశీయులకు ఏమాత్రమూ సాయపడే స్థితిలో లేరు. వారు నేర్చుకొని వచ్చిన అవిజాతీయభాష ప్రజలకు అర్థంకాదు. ప్రజల భాష వారికి తెలియదు. మన విద్యాధికులకు ఇంగ్లాండు గురించీ, ఇంకా ఇతర పాశ్చాత్య దేశాల గురించి మాత్రమే తెలుసునుగాని స్వదేశ పరిస్థితులేమీ తెలియవు అనీ బెసెంటు అన్నట్లుగా "విద్యాభ్యాసము మాతృభాషల ద్వారా జరుగక పోవటం చేతనే భారతదేశం నాగరక లోకంలో చాల వెనుక పడియున్నది. కొలది మందిమాత్రం బాగా ఆంగ్ల విద్య నేర్చిన వారున్నారు; అసంఖ్యాకులు సామాన్య

ప్రజలంతా విద్యాగంధము లేనివారై నారు." ఇలా మనం గుడ్డిగా నడుస్తున్నాం. ముందుగతి కానకున్నాము.

ఇలా అంటున్నానని నన్ను మీరు అపార్థంచేసుకోవద్దు ఆంగ్లభాష అంటే నాకు ద్వేషం లేదు. అనర్ఘమైన సాహిత్య సంపదగల భాష అది వ్యాపారికంగా రాజకీయంగా అది అంతర్జాతీయ భాష మైనది కాని అంతమాత్రాన దాన్ని తెచ్చి బలవంతాన మన గొంతుల్లో నూరిపోయుటం సబబుగా లేదు. ఉన్నతపాఠశాలలో మన విద్యార్థులు ఆంగ్ల భాషను ఒక నిర్బంధ విద్యగా అభ్యసించనీయండి పోనీ. కాని ఈ దేశంలో ఆంగ్లం ద్వారా బోధనాపద్ధతులు సాగుతూండవలసిన అవసరం ఏమిటో నాకు బోధపడటంలేదు. తమ మాతృభాషలోనే బాలబాలికలు చివరవరకూ విద్యాభ్యాసము చెయ్యవలె. అది వారి జన్మహక్కు.

మాతృభాషలోనే బోధనాపద్ధతి సాగవలెనన్న ఆశయానికి విరుద్ధంగా కొందరు విద్యాధికులు కావించే వాదనలను నే నిక్కడ చర్చింప దలచుకోలేదు. ఆ సంబంధమైన విషయ సంగ్రహమంతా నేను రాసిన 'Medi um of Instruction' అన్న పుస్తకంలో పొందుపరిచాను. కావలసి స్తే చదువుకోవచ్చు. మన దేశంలో ఆంగ్లబోధనాపద్ధతి అత్యంత విషాదకరమైనదని నేను ఖండితంగా చెప్పగలను అది ఎంత అసందర్భమైనదో, ఎంత నిరుపయోగమైనదో ఇప్పటికైనా మనం వెంటనే గుర్తించాలి.

బోధన మాతృభాషలలోనే జరుగవలసినదిగా వారు అనిమిషమయిన ఆందోళనచేస్తూ ఉండాలి. తమసంఘ సమావేశాలలో అలాగని తీర్మానములు గావించి వాటిని విద్యాశాఖాధికారులకు పంపాలి. మా మాతృ భాషలోనే మేము విద్యనేర్చుకుంటాం అని విద్యార్థులు గట్టిపట్టు పడితే ఎంత వారూ ఒకవిజాతీయభాషను తెచ్చి వారి నెత్తిన రుద్దటానికి సాహసించలేరు.

విద్యార్థి సంఘాలవారు సారస్వత సమావేశాలు కూడా జరుపుతూ ఉండాలి. దేశభాషలలో వాదోపవాద సభలు, వక్తృత్వపోటీలు, ఉపన్యాసాలూ అప్పుడప్పుడు ఏర్పాటుచేస్తూ ఉండాలి. తద్వారా విద్యార్థిబృందంలో దేశ భాషాభిమానం పెంపొందుతుంది.

---

# 8 హిందూ - ముస్లిం - ఐక్యత

హిందూ మహమ్మదీయు పరస్పర విద్వేషము మాతృభారతికి తీరని కళంకం; మనస్వరాజ్య సంపాదనకు పెద్ద ఆటంకం. హిందూ - ముస్లిం సంబంధాలనుగురించి చరిత్ర పరిశీలిస్తే నేడున్న ఈ మతవైషమ్యం యాభై సంవత్సరాలపూర్వం ఉండేదికాదని తెలుస్తుంది. ఈ నాడైనా ఏడులక్షల గ్రామాల్లోని భారత ప్రజ మత విభేదాలంటూ లేకండానే ఉంది. అసలీ హాలాహలాన్ని బ్రిటిష్‌పాలకులే—ఈ ఇరవయ్యో శతాబ్దారంభంలో 'ప్రత్యేక నియోజకవర్గా' లంటూ ప్రవేశపెట్టి—ఎక్కి..ం

చారు. అది ఇన్నాళ్ళనించీ మెల్లగా పనిచేస్తూ ఉన్నది. దాని పరిణామమే నేటి 'పాకిస్థాన్' నినాదం హిందూ ముస్లిం విభేదాలు పాలకులు పెంపొందించిన వన్నమాట యదార్థమే. అయినా ఈ 'మతసమస్య' ఉత్పన్నం కావటానికి మనం చేసిన తప్పిదాలూ ఉన్నవి. కాబట్టి ఈ రెండుజాతుల సమైక్యతను సాధించేందుకు మనశాయశక్తులా కృషిచెయ్యవలసియున్నది

పాకిస్తాన్ గురించి రెండుమాటలు చెబుతాను బలవంతములైన సామ్రాజ్య దేశాలముందు యూరప్‌లో చిన్నచిన్న రాజ్యాలు ఛిన్నాభిన్నమైపోతూన్న ఈరోజుల్లో భారతదేశ విభజనను ప్రతిపాదిస్తూన్న పాకిస్థాన్ నినాదం అవివేకజనితము, హాస్యాస్పదమున్నూ. భారతదేశాన్ని రెండు రాజ్యాలుగా విభజించటమువల్ల బ్రిటిషు అధికారము మరింత సుస్థిరమై, మనదాస్యము శాశ్వతమౌతుంది 'ముస్లింలు ఒక ప్రత్యేకజాతి' యన్నవాదన సాంఘిక శాస్త్ర ప్రాథమిక సూత్రాలకే విరుద్ధము, భారతదేశ చరిత్రకున్నూ వ్యతిరేకమే. జిన్నా 'పాకిస్థాన్' అంటూ పలవరిస్తున్నాడంటే ముస్లిం రాజ్య సంస్థాపన' కాదు అతని ఆశయం... దేశంలో తర్వాతా రాజకీయ ప్రతిష్టంభనము సృష్టిస్తూ ఉంటే అతనికి ఆనందంగా ఉంటుంది. ఈనాటికీ అతను పాకిస్థాన్ గూర్చిసమగ్రంగా విస్పష్టంగా నిర్వచించనేలేదు. లోలోపలనే విజృంభిస్తూ ఉంటుంది కామాలు అతని పాకిస్థాన్ ప్లాను యావద్భారత దేశాన్ని ఆక్రమించుకునేంత ఘనకూ,

అట్టి ముస్లింనాయకత్వాన్ని మనం అంగీకరించ లేము. కాని ముస్లిం ప్రజలపట్ల మనం అసూయాద్వేషా లను పెంచుకోవటం ఆత్మవిధ్వంసకమైన పని. ఈరెండు జాతుల పరస్పర సామరస్యానికి, సహృదయతకూ కృషి చేయకుండా... హిందువులు కయ్యానికి తయారై మహ మ్మదీయులను పూర్తిగా అణగద్రొక్కివేయాలి... అని కొందరు నాయకులంటున్నారు. కాని ఈ దేశంలో అట్టి యుద్ధాన్ని హామీ తుమీ తేలేవరకూ బ్రిటిష్ ప్రభు వులు చూస్తూ ఊరుకోరు. వారుమనలో మనల్ని కొంతవరకు మాత్రమే పోట్లాడుకోనిస్తారు. తుదివరకూ పోరాటం సాగి ఏదో ఒకరకంగా సమస్యా పరిష్కారం అయితే... అదివారంస్వార్థఆశయాలకు అఘాతమౌతుంది. కాగా సాంఘికమైత్రి ఈదేశానికి అత్యావశ్యకమైనది. జాతీయైక్యతలేని భారతదేశాన్ని బ్రిటిష్ ప్రభుత్వంకొల్ల గొడుతూనే ఉంటుంది. హిందూ - ముస్లిం సమైక్యత సిద్ధించిననాడు మనదాస్యశృంఖలాలు పటాపంచలౌతవి ప్రస్తుతి ముస్లిం - నాయకత్వానికి స్వస్తి చెప్పవలె నంటే — జాతి వైషమ్యాగ్నిని రగుల్పటం కాదు మనం చేయవలసినపని. ముస్లింలతో మైత్రి పెంపొం దించుకోవాలి; వారిపట్ల సమరసభావంతో వ్యవహ రించాలి.

ఎంతో ప్రముఖమైన ఈ జాతీయైక్యతా సిద్ధికి విద్యార్థుల కర్తవ్యం ఏమిటి ఇవిగో కొన్ని సూచనలు:

1. విద్యార్థులు జాతి విద్వేషములను చంపుకో వలెను. హిందూ - ముస్లిం విద్యార్థులు పరస్పరము

ఏంతో సమరసంగా, సమ్యోధ్యతగా వ్యవహరించాలి నేటి విద్యార్థులే భవిష్యత్ పౌరులు మత వైషమ్యాలు వారిలో అంతర్హితములైతే రెండుసంవత్సరాల్లో శాశ్వత హిందూ - ముస్లింఐక్యత నెలకొంటుంది.

2. మత ప్రాధాన్యంగల స్కూళ్ళను, కాలేజీ లను, వాటికి ప్రత్యేక అనుబంధములైన వసతి గృహాలను నిర్మూలించేందుకు విద్యార్థులు ఆందోళనచెయ్యాలి. అట్టి సంస్థలే మతవైషమ్యాలకు పుట్టిళ్ళు.

3. హిందూ విద్యార్థులు ఖురాన్ చదువుకోవాలి మహమ్మదు ప్రవక్త చరిత్రను కూడా పఠించాలి. అలాగే ముస్లిం విద్యార్థులున్నూ హిందూమత గ్రంథాలను అవలోకించాలి. అందువల్ల ఇరుతెగలందూ మతసహనం ఏర్పడగలదు.

4. ఇద్, మొహరంలాంటి మహమ్మదీయుల పండగల సందర్భాల్లో హిందూ విద్యార్థులు తమముస్లిం మిత్రుల ఇళ్లకు వెళ్ళివస్తూ ఉండాలి, అలాగే హోళీ, దీపావళీలాంటి హిందువుల పండుగల్లో ముస్లింవిద్యార్థులు సమ్మితులు కావచ్చు.

5. విద్యార్థిసంఘాల ఎన్నికల సందర్భంలో స్వమతాభిమానాలకు తావుండరాదు బాధ్యతాయుతపదవులకు ముస్లింవిద్యార్థులను కూడా ఎన్నుకుంటే పరస్పర విద్వేషాలు పోతాయి. ఈ పద్ధతి మున్ముందు రాజ్యాంగ లో సంయుక్తనియోజకవర్గాలకు దారితీస్తుంది.

ఇవి కొన్ని సూచనలు మాత్రమే. హిందూ ముస్లిం సమైక్యతా దోహదములైన మన విద్యార్థి ధర్మా

లను ఇంకా కొన్నింటిని విద్యార్థులు నిర్ణయించుకుని అనుసరించవచ్చును.

హిందూ - ముస్లిం జాతుల మధ్య ప్రస్తుతం ఏర్పడిన అంతరాన్ని పూడ్చివెయ్యాలి. అలాగాక ఎవరికి వారు 'నాలిపి నాభాష, నాసాహిత్యం, నాసంస్కృతి' అంటూ దూరదూరం పోవటానికి ప్రయత్నించేట్టయితే పాకిస్థాన్ తప్పదు.

'అఖండ హిందూస్థాన్' అని గర్జిస్తూన్న మహానుభావులు కూడా సాంఘిక - సాంస్కృతిక విభేదాలను మరింత జటిలం చేసేధోరణిలో మాటాడుతున్నారు. ఇది చాల విచారకరమైనసంగతి. భారతదేశం అవిభాజ్య-ఏకఖండంగా ఉండవలెనంటే అన్నిమతాలవారూ అన్నదమ్ముల రీతిని ఉండాలి. కొన్ని రైలుస్టేషనులలో హిందువులకు మంచినీళ్ళు వేరు, మహమ్మదీయులకు మంచినీళ్ళు వేరు. ఇట్టి ఆచారాలు నశించాలి సాంఘికమైత్రి లేని రాజకీయైక్యత స్వప్నతుల్యము.

---

# ౯ అస్పృశ్యతానివారణ

భారతీయుల సాంఘిక జీవితంలో అస్పృశ్యత అనేది మరొక అనర్థం. ఇది ఎందుకు, ఏనాడు మనలో ప్రవేశించిందో చెప్పటం కష్టం. అది మిక్కిలి గర్హ్యమైన ఆచారమని మాత్రం మనం ఒప్పుకోవలసిందే. ఈసాంప్రదాయంఅసహ్యకరమైనది; అమానుషమైనదిన్ని

అహం' స్వార్థం దానికి మూలకందాలు, కొన్నిచోట్ల హరిజనుడు కనిపించినంత మాత్రాన్నే బ్రాహ్మణుడు మైలపడిపోతాడు. మనం అస్పృశ్యులను పశువులకంటె హీనంగా చూస్తున్నాం. మన బావుల్లో వాళ్లు నీళ్ళు తోడుకోకూడదు. అగ్రజాతుల నిర్దాక్షిణ్య ప్రవర్తనలకు ముఖ్యంగా పల్లెలలో హరి జనులు ఎన్నోకష్టాలను భవించ వలసి వస్తున్నది. హరిజనులపట్ల హిందువుల ప్రవర్తన హింసాత్మకంగా ఉంది. హిందువులంటే— రానురాను హరిజనులకు ద్వేషం ప్రబలిపోయిందంటే అది హరిజనుల తప్పా? ఈ అస్పృశ్యతను మనంత్వరలో నిర్మూలించకపోతే భారతీయుల సాంఘిక జీవితం దుష్పరిణామాలకు లోనుగావలసి ఉంటుంది!

పర ప్రభుత్వపు దాస్యంలో ఉన్నంత కాలమూ మనమంతాకూడా అస్పృశ్యులమేనని హిందువులు... ముఖ్యం,గా అగ్రవర్ణాలవారు జ్ఞాపకం ఉంచుకోవాలి. ఈ మనబానిస దేశంలో ఆంగ్లేయులే బ్రాహ్మణులు. ఈనగ్న సత్యాన్ని మనం సంపూర్ణంగా అవగతం చేసుకున్న మర్నాడే అస్పృశ్యత చాలవరకు నిర్మూలిత మౌతుంది మనమంతా భగవంతుని బిడ్డలం. మనలో మనం ఉచ్చ నీచ విభేదాలను కల్పించుకోవటం భగవంతుని యెడల అపచరించటమన్నమాటే.

అస్పృశ్యతానివారణ కొరకు విద్యార్థులు అనుసరించవలసిన కొన్ని సూచనలు.

1. మనం సనాతనులం; 'తక్కువ కులస్థులను తాకనే కూడదు' అన్న భావాన్ని విద్యార్థులు వదల్చుకోవాలి; తమ తల్లిదండ్రులకు కూడా నచ్చజెప్పాలి.

2 విద్యార్థులు తమ కళాశాలలకు అనుబంధితాలైన భోజన - వసతి గృహాలలో సకరికి హరిజనులనే నియమించుకోవాలి అనాకర్లు శుచి, శుభ్రత పాటించవలసినదే

3. విద్యార్థులు జట్లుజట్లుగా అప్పుడప్పుడు హరిజనుల గూడెములకు వెడుతూ, వారితో సాయలా సాయలాగా ఉంటూ, ఆరోగ్యసూత్రాల్ని ముఃఖ్యంగా వారి బిడ్డలకు ఉపదేశిస్తూ ఉండాలి.

4. స్కూళ్ళలోనూ, కాలేజీలలోనూ హరిజన విద్యార్థుల భావములను గౌరవించ వలసినదే. వారిని చిన్న బుచ్చే ప్రవర్తన అగ్రవర్ణస్థు లనబడే విద్యార్థులకు తగదు. సాంఘిక సమావేశాల్లోనూ, విందు నందర్భాల్లోనూ వారి మనసు నొచ్చేరీతిని ఎవరూ ప్రవర్తించకూడదు!

హరిజనులకోసం ప్రత్యేక కళాశాలలు, ప్రత్యేక వసతి గృహాలు ఏర్పరిచే ప్రయత్నాలను సాగనీయకూడదు. అట్టి యేర్పాట్లు అస్పృశ్యతను నిర్మూలించటానికి బదులుసాంఘిక జీవితంలో ఉచ్చనీచ విభేదాలను శాశ్వతం చేస్తాయి.

ఈ హరిజన సమస్యతో పాటు విద్యార్థులు... దేశంలో అక్కడక్కడ నివసిస్తూన్న ఆదిమనివాసుల అభ్యుదయానికి కూడా పాటుపడాలి. క్రిస్టు మిషనరీలు

ఈ ఆదిమనివాసుల అభివృద్ధికి కొంత కృషిచేశారు. కాని మనమే మనదేశంలో వెనుకబడి యున్న సోదరజాతులకు ఎందునా ఉపయోగపడ్డాంకాదు. ఆదిమనివాస స్థానాలకు చేరువగా ఉన్న కళాశాలలలోని విద్యార్థులు ఈ బాధ్యతను నిర్వహించవలె.

—*—

## 10 సాంఘిక సేవ

కష్టసమయాల్లో దేశీయులను ఆదుకుంటూ విద్యార్థులు చెయ్యగల సాంఘికసేవ ఎంతైనా ఉన్నది. రాజకీయ నిర్బంధితుల కుటుంబపోషణ నిమిత్తం వారు విరాళాలను వసూలు చెయ్యాలి. వేలకొలది దేశభక్తులు ప్రభుత్వపు జైళ్ళలో మగ్గుతూన్నారు. కష్టాల్లో ఉన్న వారి కుటుంబాలకు తగినంత ధనసహాయం చేకూర్చి పెట్టటం గొప్పసంగతి. రోజుకు ఒక అణా చొప్పున అయినా కూడబెడుతూ విద్యార్థులు దేశోపయోగకరములైన నిధులకు తాము కూడా చందాలు ఇవ్వాలి.

ఇట్టి పనులు కేవలము సాంఘికములు, దాక్షిణ్య చోదితములు. కాబట్టి అందుకు విద్యాశాఖాధికారులు అడ్డు పుల్లలు వెయ్యకూడదు.

యుద్ధసమయంలో మితిమించిన కష్టనష్టాలకు లోనైనవి బెంగాల్-బీహార్-ఒరిస్సారాష్ట్రములు అక్కడి విద్యార్థులపై బాధ్యత ద్విగుణీకృతమైంది. వారు ఇట్లు ఇట్లుగా ఏర్పడి క్షామబాధిత ప్రజలకు సాయం

చెయ్యాలి. బెంగాల్‌లో అండి కరువైంది. ఇప్పుడు గడ్డ కూడా కరువైంది. ఈ రెండు కరువులూ మానవుడు తెచ్చి పెట్టినవే. పారంతేని మానవుని స్వార్థప్రవృత్తి పరిణా మములే అవి, బీద ప్రజలకు ముఖ్యంగా పల్లెటూళ్ళ లోని దరిద్రనారాయణులకు శాయశక్తులా సేవచెయ్య టం విద్యార్థుల విధ్యుక్త ధర్మం.

---

# 11 విద్యావ్యాసంగం

ప్రతివిషయాన్ని గురించి సమగ్రంగా చదివి తెలు సుకోవాలన్న ఆకాంక్ష మన విద్యార్థులలో చాల తక్కువగా ఉన్నది. ప్రస్తుత విద్యావిధానం వారిని ఆలాగ తయారు చేసింది మరి! ఎంతసేపటికీ వారి ఆశయం "ఎలా పరీక్షలో నెగ్గి బయట పడ తామా' అని మాత్రమే. దేశ సమస్యలను గూర్చిన సమగ్రవిషయ సంగ్రహం కోసం వారు ప్రయత్నిం చటమే లేదు. కమ్యూనిష్టు మిత్రులు మాత్రం ఈవిష యంలో కొంచెం జాగ్రతపడుతున్నారు. వివిధ విష యాలను గూర్చి విద్యార్థులు అనవరతం చదువుకుంటూ ఉండాలి. సోషలిజమ్, బోల్షివిజమ్, ఫాసిజమ్, గాంధీ ఇజమ్ మొదలైన వివిధతత్త్వాలను గూర్చి విద్యార్థులు అన్నివివరాలనూ సంపూర్ణంగా తెలుసుకోవాలి. మిడి మిడి జ్ఞానంవల్ల లాభంలేదు, స్కూళ్ళలోనూ, కాలే

జీలలోనూ అట్టి విద్యావ్యాసంగానికి అవకాశాలను కల్పించవలె. ఈనాటి మాటిక్కి పార్టీ రాజకీయాలను గురించి పవాదపడుతూ వృధా కాలక్షేపం చేయకూడదు. నైతికంగాను వైజ్ఞానికంగా అవసరమైనంత విషయసంగ్రహం చేసి, పెద్ద పెరిగిన తర్వాత ఉత్తమ పౌరబాధ్యతలను నిర్వహింపగలందులకు అర్హత సంపాదించుకోవాలి. సంపూర్ణ విద్యావ్యాసంగం, కార్యదీక్ష లేనివారు ఉత్తమపౌరులనిపించుకోజాలరు.

మా కాలేజీలో అట్టి విద్యావ్యాసంగానికి అవకాశాలను కల్పిస్తున్నాం. విద్యార్థులు తప్పని సరిగా చదువవలసిన గ్రంథాల 'లిస్టు'ను తయారుచేస్తున్నాం. ఇట్టి విద్యావ్యాసంగము విద్యార్థుల విజ్ఞానదాహాన్ని తీర్చగలవు. జ్ఞానజిజ్ఞాసా స్వభావం లేనివాడు విద్యార్థి కాడు.

గాంధీజీ రాసిన Constructive programme its meaning and place" రాజేంద్ర ప్రసాద్ రాసిన Constructive Programme'some suggestions, అన్నగ్రంథాలు విద్యార్థులకు ఎంతైనా ఉపయోగిస్తాయి. విద్యార్థిసమస్యలను గూర్చి గాంధీజీ అనేక వ్యాసాలు రాశారు, చాల ఉపన్యాసాలిచ్చారు. వాటి నన్నింటినీ ఆనంద శ్రీహింగోరాని పుస్తకరూపంగా ప్రచురించారు. అది యువకులు తప్పక పఠించవలసిన పుస్తకం.

---

# 12 సంఘ సంస్కరణ

కళాశాలలలో చదువుకుంటూనే విద్యార్థులు సంఘసంస్కరణోద్యమానికి చాలవరకు చేయూత ఇవ్వవచ్చును. అందుకుగాను వారు ప్రత్యేకంగా కొంత సమయాన్ని వినియోగించ నక్కర లేకుండానే ఒక కార్యక్రమాన్ని నేనిక్కడ ప్రతిపాదిస్తున్నాను. విద్యార్థులు పూనుకొని ముఖ్యంగా సాగించవలసిన కొన్ని సంస్కరణలు:

1. బాల్యవివాహాలు:—మనవారి శరీరపుష్టిని, ఆరోగ్యాన్ని క్షీణింప చేస్తున్న సాంఘిక దురాచారాలలో బాల్యవివాహపద్ధతి ముఖ్యమయినది. నిజానికి ఈ దేశంలో అనేక మంది అకాలమృత్యువువాత పడుతున్నారంటే—శిశుమరణ సంఖ్య అత్యంత విషాదకరంగా ఉన్నదీ అంటే-అందుకు ప్రధాన కారణం ఒకపూటైనా కడుపునిండా తినే ఆహారం లేని ఘోర దారిద్ర్యమే. అయినా బాల్యవివాహాలు కూడా అందుకు దోహదం చేస్తున్నవి. అవి మనసంఘంలో ఒకకాలంలో ఎప్పుడు వచ్చి ప్రవేశించినవో మరి! అదికాలంలో ఈ ఆచారం ఉన్నట్టు మన మతగ్రంథాల్లో ఎక్కడా నిదర్శనం కనిపించదు. ఈ అనర్థానికి చరిత్రాత్మక కారణాలు ఏమైఉన్నా దాన్ని త్వరలో రూపుమాపవలసిన బాధ్యత మనం గుర్తించాలి. మన యువతులు శరీరపుష్టి, బుద్ధిబలము సమకూర్చుకో వలసిన లేతవయసునందే బిడ్డల తల్లులౌతున్నారు. ఇది ఎంత ప్రకృతి విరుద్ధంగా ఉందో

ఆలోచించండి. ఈవిధంగా బాల్యవివాహాలవల్ల ఇంద్రియపుష్టి నశిస్తున్నది; సంతానాల బలహీనత ఏర్పడుతున్నది; ఆయువు క్షీణిస్తున్నది. జాతిని నిస్తేజస్కు, నిర్వీర్యము చేస్తున్న దురాచారం ఇది.

ఆర్థికంగా చూచినా ఈబాల్య వివాహాలు అసంగీకారములే. మన యువకులు విద్యార్థిదశలోనే పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు. కళాశాల, లనించి బైటికి రాగానే తమకుటుంబాలను పోషించుకోగల శక్తిసామర్థ్యాలు వారికి ఉండవు. నిరుద్యోగ సమస్య మధ్యతరగతి వారిని నిలువదీసి తర్జిస్తున్నది ఉద్యోగమూ దొరకదు; కుటుంబనిర్వాహణబాధ్యతలా నానాటికి దుర్భరమౌతూ ఉంటాయి. ఇక జీవితం ఎంత నికృష్టంగా ఉంటుందో ఊహించుకోవచ్చు యువకులు చీకుచింతలతోకుంగిపోక తప్పదు. వారికుటుంబ జీవితము సౌఖ్యప్రదము కాకపోగా నరకయాతనగా పరిణమిస్తున్నది.

కాబట్టి విద్యార్థులు జీవితంలో చక్కగా కుదురుకున్న తరువాతనే—కుటుంబ పోషణకు తగినంత ధనార్జన చెయ్యగలిగినప్పుడే—వివాహం చేసుకోవాలి. సాధారణంగా తల్లిదండ్రులు తమ బిడ్డలకు చిన్నతనంలోనే పెళ్ళిళ్ళు చేసి వెయ్యాలని ఆరాటపడతారు. కానివిద్యార్థులు వాస్తవిక పరిస్థితులను గుర్తించాలి 'విద్యార్థులు స్వతంత్రేచ్ఛాసంపన్నులై—తమకు ఇష్టంలేని పనులను తమచే చేయించేందుకు ప్రయత్నించే శక్తులను ధైర్యంగా నిరోధించగలవారై ఉండవలెను. ముఖ్యంగా

వివాహవిషయంలో తమ అభీష్టములనే కొనసాగించుకోవలెను"—అని గాంధిజీ ఉపదేశం.

2. కట్నాల పద్ధతి ;-కట్నాల పద్ధతి కూడా దేశంలోని అన్ని రాష్ట్రాలకూ వ్యాపించిపోయింది. త్వరలో రూపుమాసి పోవలసిన మరొక దురాచారం ఇది. వరునిగాని, కన్యనుగాని శుల్కం ఇచ్చి కొనుక్కునేట్లయితే అది వివాహం అనిపించుకోదు. ప్రజల్లో వ్యాపారదృష్టి రెచ్చిపోయిన కాలంఇది. అందుచేత వారికి మానవ జీవితపు విలువ తెలిసి రావటంలేదు. హృదయం మొద్దుబారిపోతున్నది. రెండుహృదయాల పవిత్ర సమ్మేళనమునకు ఆశయంగా ఉండవలసిన వివాహం ఒకవ్యాపారతంతుగా దిగజారిపోయింది. ఎంతశోచనీయం!

"తప్పని సరిగా కట్నం తీసుకొని వివాహమాడే యువకుడు ఎంతచదువుకుని ఏం లాభం? అతని వలన దేశానికే అవమానం. కట్నాన్ని స్వీకరించి అతడు స్త్రీజాతినే అవమానిస్తున్నాడన్నమాట." అని గాంధిజీ అన్నాడు. కట్నాల పద్ధతి నీచాతి నీచమైనదిగా ప్రజలంతా గుర్తించేలాగ ప్రబోధం చెయ్యాలి. కట్నానికి చెయిచాచి కలుషితుడైన ప్రతియువకుని సంఘం నించి వెలివేయవలసినదే.

గాంధిజీ ఇంకా ఏమంటున్నాడో చూడండి, "కట్నంకోరే యువకుని మేము పెళ్ళిచేసుకోము. అట్టి బేరగాళ్ళను కట్టుకొని అవమానితులయ్యేకన్న యావజ్జీవమూ అవివాహితులముగానే ఉంటాము —అని బాలికలు నిర్ఘాటంగా చెప్పాలి. తల్లి దండ్రులు వారికి

అలాంటి విద్య, గరపాలి పరిపూర్ణ ప్రేమ, పరస్పర అంగీకారము—ఇవే అవశ్యకములైన వరకట్నాలుగా, కన్యాశుల్కాలున్నూ"

వర్ణవ్యవస్థ కూడా కట్నాల పద్ధతిని ప్రోత్సహిస్తున్నది. వర్ణాంతర వివాహాలు కూడదని ఒక నిషేధం ఉండాయెను. వరుని ఎన్నుకోటంలోగాని, కన్యను వెతుక్కోటంలోగాని స్వకులాన్ని దాటి పోకూడదు. తత్ఫలితంగా కట్నాల రేటు పెరుగుతూ ఉంటుందేగాని తగ్గదు. ఈదురాచారం నశించాలంటే వర్ణాంతర వివాహాలనూ, జాత్యంతర వివాహాలను కూడా ప్రోత్సహించ వలసినదే.

ప్రతియువకుడూ కట్నం తీసుకోకుండా వివాహమాడి తక్కిన వారికి మార్గదర్శకుడు కావాలి. ఇలాగ సంఘ సంస్కరణోద్యమానికి తాను తోడుపడవచ్చును.

3. వర్ణవ్యవస్థ: వర్ణవిభజనకూడా నిర్మూలము కావలసినదే. అది వివాహ సమస్యను క్లిష్టతరం చేస్తున్నది; హిందూసంఘానికి అవమానకరమైన విభేదాలను సార్వకాలికంగా సుస్థిరం చేస్తున్నది. అంటరాని తనము యనర్థాలను మరల ఇక్కడ ఏకరువు పెట్టనక్కర లేదు.

"అంటరాని తనము ఒక పాపం; క్షంతవ్యము కాని ఒక అపరాధం. ఈవిషసర్పాన్ని చంపివెయ్యక పోతే అదే మన హిందూ సంఘాన్ని తన విషవాయువులలో ఆహారించేస్తుంది"-అని గాంధిజీసూక్తి.

వర్ణవ్యవస్థ అభివృద్ధి నిరోధకంగా ఉన్నది. అది మానవ జాతిలో ఉచ్చ-నీచ విభేదాలను సృష్టిస్తున్నది.

"అతని కంటే నేనే అధికుణ్ణి అని భావించే వాడుతోడి మానవుని పట్ల, భగవంతుని పట్ల ద్రోహి ఔతున్నాడు''-అని గాంధిజీ అంటాడు.

గాంధిజీ వర్ణవ్యవస్థను సమర్థిస్తాడని కొందరి అభిప్రాయం. అది పొరపాటు. ప్రస్తుత భారత వర్షంలోని వర్ణవ్యవస్థను గాంధిజీ ఎన్నడూ హర్షించడు. వంశపారంపర్యంగా వచ్చే వృత్తి ననుసరించియే 'వర్ణము' అని ఆయన నిర్వచనం. విజ్ఞాన ప్రబోధము, దేశరక్షణ, వర్తకవ్యాపారము, కృషి-ఇవి నాలుగున్నూ వృత్తులుగా నాలుగు వర్ణాలు ఏర్పడినవి ఈ నాలుగు వృత్తులూ ఎప్పుడూ ఉండేవే తన అభిరుచులను బట్టి, శక్తిసామర్థ్యాలనుబట్టి ఎవడు ఏ వృత్తిని అవలంబించినా అవలంభించవచ్చును. వంశపారంపర్యంగా వచ్చే వృత్తివల్ల తత్సంబంధమయిన సాంకేతిక పరిజ్ఞానం చవ్వున అలవడుతుంది. ప్రస్తుతం అమలులో ఉన్న వర్ణవ్యవస్థ వృత్తిపై గాక, పుట్టుకపై ఆధారపడి ఉంది; పైగా శాఖా విభేదాలను పెంపొందిస్తున్నది; కాగా దాన్ని మనం నిర్మూలించ వలసిందే.

4 ఘోషాపద్ధతి:—యువకులు పూనుకని రూపుమాపవలసిన దురాకదురాచారము-ఈఘోషానియమం. హిందూయుగంలో ఈఘోషా పద్ధతి మన దేశంలో లేదని చరిత్ర చెబుతున్నది ముస్లిం పరిపాలకుల ద్వారా ఇది దేశంలో ప్రాకివచ్చింది. మహమ్మదీయ బీబీలు 'పరదా' ఉపయోగించేవారు అదొక 'ఫేషన్' అని కొందరు హిందువులు అనుసరించారు ఇంకా ఇతర

కారణాలు కొన్ని ఉండవచ్చును. ఆగోడవలన్నీ మన కెందుకు? స్త్రీవిద్య అభివృద్ధి చెందుతూన్న కొద్దీఘోషా నియమం అంత మరీ ఘోరంగా పాటింప బడటంలేదు. కాని కొన్ని రాష్ట్రాలలో ఈ ఆచారం పూర్తిగా అమ లోవుంది.

ఘోషా నియమాన్ని పాటించు కుటుంబానికి చెందిన బాలికను వివాహమాడకూడదని విద్యార్థులు ఒకనిబంధన పెట్టుకోవాలి. తల్లిదండ్రులను ధిక్కరించి యైనా తను భార్యలను ఘోషా పద్ధతినించి తప్పించాలి.

ఘోషాపద్ధతిని నిర్మూలించటంవల్ల... సిగ్గువిడిచి వీధుల్లో స్వేచ్ఛగా తిరగటానికి లైసెన్సు వచ్చినట్లుగా యువతులు భావించరాదు. ప్రస్తుతం అమలులో ఉన్న ఘోషాపద్ధతి ఘోరంగా ఉంది; అందుచేత చదువుకున్న యువతీయువకులు దాన్ని తొలగించే ప్రయత్నాలు చెయ్యాలి.

పైని సూచించిన సంఘ సంస్కరణలను సాగించేటప్పుడు అనేక కష్టాలను ఎదుర్కొవలసి ఉంటుంది. విద్యార్థులు ధైర్యసాహసాలతో, ఆత్మవిశ్వాసంతో అన్ని అవరోధాలనూ గడచి సంఘసంస్కరణోద్యమం లో విజయులు కావాలి.

---

## 13 భారత సంస్కృతియందభిమానం

చాల కాలంగా మనం పాశ్చాత్యులను అనుక రిస్తూ వచ్చాం. వారి ఆచారవ్యవహారాలను అనుసరిం

చాం. ఇకనైనా బుద్ధి తెచ్చుకుని భారతీయులవలె బ్రతుకుదాం. వేషభాషల్లో, హావభావాల్లో భారతీయుల మరలుచుకుందాం. మనలో నెలకొని వున్న పాశ్చాత్యనాగరికతా వ్యామోహాన్ని తుడిచివేద్దాం. ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకుందాం.

అని ప్రతియువకుడూ ఉత్తేజితుడై — వైభవోపేతమైన, అనాది సిద్ధమైన మన సంస్కృతి ప్రాతిపదికగా భారత జాతీయ పునరుద్ధరణకు నడుముబిగించవలె. జాతీయ జీవితపు అన్నిశాఖలూ ఈ విధముగానే పునరుజ్జీవితములు కావాలి. ఈ నిర్మాణ బాధ్యత అంతా ఈ నాటి యువకులైన విద్యార్థుల భుజస్కంధాలపై ఉన్నది.

మన జాతీయ వస్త్రధారణముపట్ల మనకెందుకు అభిమానం ఉండగూడదు? ఐరోపీయ వస్త్రధారణలోనే 'గౌరవ మర్యాద'లున్నా యన్న భావాన్ని మరచి పోవాలి. ధోవతి, అఫాటము ఇవి భారతజాతీయతకు నిరాడంబర చిహ్నాలు, భారతీయయువతులు చీరలు ధరించు పద్ధతి ఎంతో రమణీయమైనది; పాశ్చాత్య స్త్రీలుకూడా ఆపద్ధతిని అనుసరిస్తున్నారు. మన ఆడపడుచుల చీరసింగారం ముందు తెల్ల దొరసానుల వస్త్రధారణము ఎంత అందవిహీనంగా ఉంటుందో గమనించండి! అయినా కూడా ఫేషన్ బలిసిపోయిన కొందరు భారతీయయువతులు 'ఫ్రాకు'లపై, 'గౌను'లపైనే మోజుపడుతూ ఉన్నారు. అదిభావదాస్యం కాదా?

మన జాతీయభాషను చూచుకుని మనం ఎందుకు గర్వపడరాదు? ఉదాత్తభావ ప్రకటనకు అది తగింది

కాదా? తమనోట ఎంతకటువుగా, అసహ్యంగా ధ్వనిస్తూ ఉన్నా ... మనలో చాలమంది ఆంగ్లభాషలోనే మాటాడాలని మోజుపడతారు, ఎందుకోమరి! మనలో మనం ఇంగ్లీషులో పలకరించుకోవటం చూస్తే ఇంగ్లీషువాడు లోలోపల ఎంతగా నవ్వుకుంటాడు! తన జాతీయసాహిత్యం పట్ల అభిమానం గల వ్యక్తినే ఆంగ్లేయుడు గౌరవిస్తాడు. ఈ విషయం నేను లోగడ వెళ్ళినప్పుడు గమనించాను ఇంగ్లండులోని భారతీయ విద్యార్థులు ఆంగ్లేయ సాంప్రదాయాలను అనుకరించటం చూస్తే అసహ్యం వేస్తుంది. "నీకు ఇంగ్లీషు వచ్చునా?—అని నేనొక ఫ్రెంచి దేశస్థుని ప్రశ్నించాను "ఇంగ్లీషు కాదు, ఫ్రెంచి"—అన్నాడతడు సగర్వంగా అట్లే మనం మాత్రం "ఇంగ్లీషు కాదు, హిందూస్థానీ" అని ధీమాగా ఎందుకు అనకూడదు.

బ్రిటిష్ ఆచారాలను మనం ఎందుకు అనుకరించాలి? మన సభ్యత, సంస్కృతి ఏమయినవి? మన సంస్కృతిని పునరుద్ధరించుకొని, దాని విశిష్టతకు పులకించవలసిన సమయం ఏతెంచింది. ఇన్నాళ్ళూ పాశ్చాత్య నాగరకత వెంట పరుగులు పెట్టాం. నిరాడంబర జీవితాన్ని, ఉన్నత-ఆశయాల్ని ప్రతిపాదించే మన దివ్య సంస్కృతిని విస్మరించాం. అధికోత్పత్తి, పెట్టుబడిదారీ విధానం, ఇతర దేశాలను కొల్లగొట్టుకుందాం అనే దురాశ, పరస్పరం గొంతులు నులుముకునే వర్తకపు పోటీలు, సామ్రాజ్య దాహం, భయంకర యుద్ధం-ఇవీ

పాశ్చాత్య నాగరకత పాదించే ఫలితాలు మనం కూడా అదే నాటకం ఆడి, పశ్చిమీయులతో పాటు అధః పతితులమౌతామా? మనదేశంలో పాశ్చాత్య నాగర కత మూర్తీభవించిన కోటీశ్వరునిగాను సుమా విదేశీ యులు గౌరవించేది మరి యెవరిని? అపూరిపాకలో, మోకాలు దిగని కొల్లాయి ధరించి, లక్షలాది భారతీ యుల ప్రతినిధి అయిన సేవాగ్రామ-ఆశ్రమ తపస్విని స్వీయసంస్కృతిపై అభిమానం లేని జాతి జీవించ లేదు. కాబట్టి మన విద్యార్థులు పాశ్చాత్య నాగరకతా వ్యామోహాన్ని చంపుకోవాలి,

India what can it teach us?" అనే గ్రంథంలో Max muller రాసిన ఈక్రింది వాక్యాలను విద్యార్థులు గమనించాలి:

"ప్రపంచంలో కెల్లా అధికతమంగా ప్రకృతి సంపద, ప్రకృతి సౌందర్యం కలిగి, భూతల స్వర్గమన తగినది భారతదేశమే. మానవహృదయము సంపూర్ణము గా వికసించి వివిధ జీవిత సమస్యలను అవలోకించి పరిష్కరించి... ప్లాటో కేంట్ ప్రభృతుల విజ్ఞానము కంఠస్థము చేసుకున్నవారిని కూడ ఆకర్షిస్తున్నది భారత దేశమే. గ్రీకు-రోమను యూదీయ విజ్ఞానములలో పెరిగి వచ్చిన మన ఆంతరంగిక జీవితము పవిత్రము, ప్రీతి భావంతము, శోభస్కరము కావలెనంటే... అందుకు తగిన ఉపదేశము భారతీయ సాహిత్యమునందే లభ్యము కాగలదు"

విద్యార్థులు జాతీయ సాహిత్య సంస్కృతులను జీర్ణించుకునేందుకు మన మతగ్రంథాలను ఆసాంతం చదవాలి. ప్రతి హిందూ యువకుడు రామాయణం, మహాభారతం, భాగవతం, భగవద్గీత తప్పక చదవాలి. మన సంస్కృతి ప్రాతిపదికలు ఈ గ్రంథాల్లో దొరుకుతవి. ముస్లిం విద్యార్థులు తమ ప్రవక్త చరిత్ర, ఖురాన్ అవశ్యం చదవాలి. ముస్లిం విద్యార్థులు హిందూ మత గ్రంథాలను, హిందూ విద్యార్థులు ముస్లిం మత మతగ్రంథాలను కూడా చదువుకో వలసిందే. విద్యార్థులంతా భారత దేశ చరిత్రను సమగ్రంగా చదవాలి, మత గ్రంథ పరిశీలన లేకుండా మాత్రం భారతీయ సంస్కృతి పునరుద్ధరణ అసంభవం.

## 14 నడవడి

ముఖ్యంగా విద్యార్థులు అనుక్షణమూ తమ నడవడికను చక్కదిద్దుకుంటూ ఉండాలి. ఆడ పిల్లలయెడ మర్యాదగా, సభ్యత ననుసరించి ప్రవర్తించాలి, తమ నడవడికను గురించి వేరొకరు వంక పెట్టేందుకు వీలుండకూడదు. సౌశీల్యం లేనివారు ఈనిర్మాణ కార్యక్రమంలో పాల్గొని ఏమి చేసినా... అది అంతా ఇసుక మేడ వలె ఏనిమిషాన్నో కూలి నేలమట్టమైపోతుంది. "మానవ జీవితానికి మకుటప్రాయమై వన్నె తెచ్చేది సౌశీల్యమే" అన్నాడు శామ్యూల్ స్మయిల్స్.

మనిషిలో త్రికరణశుద్ధి తప్పనిసరిగా ఉండాలి. ఏమతం బోధించినా 'సత్యం వద, ధర్మంచర' అనే. అఖిల వేదాంత సారమూ అదే "అర్థం లేని ఆవేశపరులు మతంపేరిట యుద్ధాలు చేస్తారు. సత్యబద్ధమైన ప్రవర్తన కలవాడే నిజమైన మతాభిమాని"—అని అలెగ్జాండర్ పోప్ కవి అంటాడు. "నీవు నీకు సత్యసంధుడివై ఉంటే ఇతర్లయెడ కూడా సత్యబద్ధుడివై యే ఉంటావు"—అని షేక్స్పియర్ మహాకవి వాక్యం.

నిర్మాణ కార్యక్రమంలో పనిచెయ్యటానికిగాని, ఉదాత్తమైన జీవితం గడుపుకోటానికిగాని... నిర్దుష్టమైన నడవడి, ఆత్మపారిశుధ్యము తప్పనిసరిగా ఉండాలి. ఇంగ్లీషు నవలలద్వారా, సినిమాలద్వారా, వార్తాపత్రికల ద్వారా పాశ్చాత్య ప్రభావము మన బుద్ధులను మార్చివేసింది. విశృంఖల విహారానికి అలవాటు పడ్డాం. నడవడికను గూర్చి శ్రద్ధ వహించటంలేదు. ఆత్మసంయమనమే జీవిత లక్ష్యంగా విద్యార్థులు పాటించాలి. ఆత్మసంయమనం లేని జీవితంచుక్కాని లేని పడవ వంటిది; ఏమిషాన ఏరాతికి డీకొని భిన్నాభిన్నమౌతుందో ఎవరికి తెలుసు?

వలపు వాంఛలు ఉండవచ్చును, తప్పేమీలేదు"

ప్రణయావేశం ఉదాత్తమయినదే అని గాంధిజీ అభిప్రాయం. కాని అది 'ధర్మప్రజాసంపత్త్యర్థ'మే వినియోగంకావాలి. కానినాడు అది పాపహేతువే. భూమిమీద

పడగానే మన ప్రథమ పరిచయం మాతృదేవితో మాతృభావంతో ఆరంభించబడిన మన జీవితం. ఈభావమే యౌవన దశయందు స్త్రీజాతియెడల మన ప్రవర్తనను నిర్దిష్టం చెయ్యాలి. మన్మథబాణాలను తప్పించుకోటం దుస్సాధ్యమే కాని నిగ్రహం అలవర్చుకోవటం గొప్ప సంగతి. విద్యార్థులు 'సెక్స్' సమస్యలను విశాల దృష్టితో పరిష్కరించాలి; తద్విషయకమయిన ఉత్తమ రచనలనే వారు చదువుకోవాలి. యువకులు స్త్రీ పురుష సంబంధములను గూర్చి విశాలోదాత్త భావాలను పెంపొందించుకుంటే సంఘంలో అనేక దుర్ఘటనలు సంభవించకుండా పోతాయి.

ఈసమయంలో విద్యార్థినులకు ఒక చిన్నసలహా: "మగపిల్లలు మాపట్ల చాల విరసంగా, బేసబబుగా ప్రవర్తిస్తున్నారు"-అని ఆడపిల్లలు అభియోగం మోపుతున్నారు. ఆమాటా నిజమే, కాని తప్పు ఆడపిల్లలలోనూ లేకపోలేదు. "ఈకాలపు ఆడపిల్ల ప్రభావతి పాత్ర ధరించి డజను మంది ప్రద్యుమ్నులతో నాటకం ఆడాలని చూస్తుంది. సాహసం జాస్తి. గాలికీ వానకూ, ఎండకూ రక్షణగా ఉండేందుకుగాక ... యువకులను ఆకర్షించేందుకే వస్త్రధారణ విన్యాసాన్ని వినియోగిస్తున్నది"-అని గాంధీజీ పలికిన వాక్యాలను విద్యార్థినులు గమనించాలి ఆడపిల్లలు పరిశుద్ధమయిన నడవడికను అలవరచుకుంటే వారిజోలికి వెళ్ళేందుకు ఏపోకిరివాడికి గుండె ఉంటుంది.

ఈసందర్భంలో సహవిద్యను గురించి నా అభిప్రాయం చెబుతాను. ప్రాథమిక పాఠశాలల్లోనూ, కాలేజీలలోనూ సహవిద్య అంగీకారయోగ్యమే కాని మధ్యమ తరగతులలో మాత్రం సహవిద్య నిషేధించవలసిందే.

ఈ నిర్మాణ కార్యక్రమంలో మంచి నడవడికను చిట్టచివరి అంశంగా పొందుపరిచాను, కాని కార్యక్రమ నిర్వాహకులు ప్రథమంగా సాధించవలసినదే అది మంచి నడవడిక, నైతికబలం లేని యువకులు మాతృభూమికి నిజమైన సేవ చెయ్యలేరు.



## ఉపసంహారం

జాతి పునర్నిర్మాణ కార్యక్రమంలో విద్యార్థులు ప్రముఖబాధ్యతలను నిర్వహించగలరని మొదటే చెప్పాను. దేశభవిష్యదభ్యుదయం నేటియువకుల బలస్థైర్యాలపై ఆధారపడి ఉంది. చీకటి మేఘాలు భయంకరంగా క్రమ్ముకువస్తున్నాయి, గాని మహాత్మభ్రాంతి భవిష్యత్తు ఉజ్వలంగా ఉండగలదనే మనం విశ్వసింపవచ్చును. ద్వితీయ మహాసంగ్రామ సందర్భంలో మన దేశానికి అంతర్జాతీయ

ప్రాముఖ్యత వచ్చింది. బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశాన్ని శాశ్వతంగా తన యినుపపాదం క్రింద తొక్కిపెట్టి వుంచాలని ఎంతగా ప్రయత్నిస్తుందో... మన భవిష్యత్ వ్యవస్థ అంత శేగీయమానంగా ఉండబోతున్నదన్న మాట ఉచ్ఛస్థితి, పతనం అన్నిజాతులకూ ఉంటాయి. పూర్వం ఒకనాడు భారతదేశం లోకోత్తర విఖ్యాతి పథమును చుంబించింది. చాలకాలం నించీ అతినికృష్టమైన దాస్య జీవితాన్ని వెళ్లబోస్తున్నది. ఇప్పుడు రోజులు మారినవి మళ్ళీ మనదేశంలో అనంత సౌఖ్యభానూదయం కాబోతున్నది. యువకులంతా మనదేశభవిష్యత్తును గూర్చి ఆశాపూరితులై ఉండాలి. అవసరమైన బాధ్యతలను నిర్వహించటానికి అందరూ నడుములు బిగించి సిద్ధం కావాలి.

అ ను బ ం ధ ము

# గ్రామజీవన పరిశీలనా ప్రశ్నావళి

1. పేరు:-(ఎ) గ్రామంయొక్క పేరు. (బి) గ్రామంలోని యిండ్లసంఖ్య.

2. జనాభా:-(ఎ) మతముల వారిగా వర్గీకరణ. (బి) గ్రామంలోని హరిజన, ముస్లిమాదియుల స్థితియేమిటి?

3. విద్య:-(ఎ) చదువుకొన్న వారెంత శాతం. (బి) ఐదు పదునాలుగేండ్ల వయసు మధ్యనున్న స్కూలుకు వెళ్లే పిల్లలయొక్క నిష్పత్తిఎంత? [శాతము ఎంత?] (సి) గ్రామంలో ప్రాథమిక పాఠశాల వున్నదా? (డి) మొత్తం జనాభాకు ఉన్నత విద్యాభ్యాసం చేసిన వారి నిష్పత్తిఎంత? (ఇ) ఉన్నత విద్యాభ్యాసం చేసిన వారిలు ఎంతమంది గ్రామాన్ని విడిచి వెళ్లారు? (యఫ్) గ్రామంలో రాత్రిపాఠశాలకు వయోజనులు ఆతురతగావున్నారా?

4. మాతాశిశు సౌభాగ్యం:-(ఎ) గత వత్సరం ఎంతమంది ప్రసవించారు? (బి) గ్రామ మంత్రసాని ఎన్నికాన్పులు చేయిస్తుంది? (సి) ఎంతమంది తల్లులు చనిపోయారు? (డి) ఒక సంవత్సరం వయసులోపున చనిపోయిన శిశువుల మరణరేటుఎంత?

5. ఆరోగ్యం:-(ఎ) గతవత్సరం ఎంతమంది చనిపోయినారు? (బి) ఎంతమంది అంటువ్యాధులతో చనిపోయారు? (సి) జ్వరం, దురద, ఉబ్బసం, కుష్ఠు, క్షయ,

సుఖసంకటాలతో ఎంతమంది బాధపడు తున్నారు ? (డి) గ్రామంలో హకీంగాని వైద్యుడుగాని వున్నాడా ? (ఇ) లేనిచో, వైద్యసహాయానికై గ్రామస్థు లెంత దూరం వెళ్ళవలసి వస్తోంది ? (యఫ్) బీదవారి కుచిత వైద్య సహాయ సౌకర్యము లున్నవా ?

6. ఆహారం:—(ఎ) సంవత్సరం పొడుగునా రోజుకు రెండుసార్లు భోంచేసే వారెంతమంది ? (బి) 1. పాలు, 2. కాయగూరలు పండ్లు, 3. తమలపాకులు, చుట్ట, నల్లమందు, గంజాయి, సారా, 4. తేనీరుకై వారెంత ఖర్చు పెడుతున్నారు ?

7. ఆరోగ్యం:—(ఎ) గ్రామానికి వచ్చేబాటలు, గ్రామంలోనిబాటలు శుభ్రంగావున్నాయా, (బి) మలం చెత్తచెదారం విసర్జనకు సరియైన ఏర్పాట్లు వున్నవా ? (సి) మురుగు పారుదల ఏర్పాట్లు సరిగా వున్నవా ? (డి) హరిజనులకు, యితరులకు మంచినీటి సౌకర్యాలు వున్నవా ?

8. ఆదాయం:—(ఎ) గ్రామస్థుని సరాసరి సంవత్సర ఆదాయమెంత ?, ఎలావస్తోంది ? (బి) సంవత్సరంలో ఎన్నిమాసాలు అతను నిరుద్యోగంగా వుంటాడు? (సి) స్త్రీలయొక్క మామూలువృత్తు లేమి ?

9. వ్యవసాయం:—(ఎ) గ్రామంలోని పంటస్థితి యేమి ? (బి) నీటిపారుదల సౌకర్యాలేవైన వున్నవా ? వుంటే తగినంతగా వున్నాయా ? (సి) గ్రామంలోని భూమిశిస్తు విధాన మెలావున్నది ?

10. గ్రామ పరిశ్రమలు:-(ఎ) గ్రామ పరిశ్రమ లేమేమి ఉన్నవి? అవి యే పరిస్థితిలో వున్నవి? (బి) గ్రామంలో యింకా యే యితర పరిశ్రమల నభివృద్ధిచేయొచ్చు?

11. అంగడి:-(ఎ) గ్రామానికెంత దూరంలో మార్కెట్టువుంది? (బి) మామూలు రహదారి సాధనము లేమి? (సి) వర్షాకాలంలో బళ్ళమీద వస్తువులను అంగడికి జేర్చడానికి వీలున్నదా?

12. రహదారి, రాక, పోకల సౌకర్యాలు:—(ఎ) దగ్గిర రైల్వే స్టేషన్, ట్రంకురోడ్డు ఎంత దూరంలో వున్నవి? (బి) దగ్గిర పట్టణానికి వెళ్లే రోడ్డెంత దూరంలో వున్నది? (సి) పోస్టాఫీసు వూరికెంతదూరంలో వున్నది? వానిని కొకసారి క్రమంగా టపావస్తుందా?

13. పశువులు:-గ్రామముయొక్క పశు సంపద ఎంత? (బి) సహకార పద్ధతిమీదపాల అమ్మకం ప్రారంభం చేయవచ్చునా? (సి) పశువ్యాధి నివారణకుగల వైద్యపు ఏర్పాట్లేవి?(డి)గ్రామంతో ఆబోతువున్నదా?

14. ఖర్చు:-(ఎ) పండగలు. (బి) సాంఘికాచార కార్యకలాపాలు. (సి) జూదం. (డి) సినిమా. (ఇ) ఇతర దురలవాట్లకు ప్రతిగ్రామస్థు డెంత ఖర్చుపెడతాడు?

15. గ్రామాధికార్లు:-(ఎ) గ్రామ మునసబు, [పటేల్, మత్ గుజార్, పట్వారీ, సాహుకార్లు] ఎవరు? (బి) రైతులతో వారి సంబంధాలు చక్కగా వున్నవా? (సి) గ్రామపునర్నిర్మాణోద్యమాలంటే వారికి సానుభూతి ఉన్నదా?

**16. ఋణగ్రస్తత, కో ఆపరేటివు సొసైటీలు:-** (ఏ) ఋణపరిమితిఎంత? అమలులోవున్న వడ్డీరేటెంత? (బి) గ్రామంలో సహకార పరపతి సంఘం ఏదైనా కలదా? (సి) బహుళకార్యనిర్వాహణంచేసే సహకార పరపతి సంఘస్థాపనకు గ్రామంలో అవకాశమున్నదా?

17. యుద్ధకాలపు కష్టాలు:-(ఏ) యుద్ధంవల్ల గ్రామస్థులకు కల్గిన కష్టములేమి? కిరసనాయిలు, పంచదార, యుద్ధనిధి యుద్ధఋణాలు, ధాన్యసేకరణ మొదలైన వానిలోగల యిబ్బందులు. (బి) వీటినిగూర్చి గ్రామస్థుల ఆరోపణలేమి?

18. సాంఘిక, వైజ్ఞానిక కార్యక్రమం:-
(ఏ) వార్తాపత్రికలు మాసపత్రికలు రావడానికేవైన ఏర్పాట్లుగలవా? (బి) పుస్తకాలయ మేదైన గలదా? (సి) భజనమండలి ఏదైన కలదా? (డి) ఇంకా ఏదైన సాంఘిక, రాజకీయ, వైజ్ఞానిక కార్యక్రమం గ్రామంలో కలదా?

19. అభివృద్ధికి సూచనలు:-గ్రామంలో సాంఘికార్థికసౌభాగ్యం కలుగడానికి నీవుచేసే సూచనలేమి?

20. ఇతర విషయాలు:- ఈ ప్రశ్నావళిలో జేర్చబడని ఏ యితర సంగతులైనాసరే?